# స్వాతంత్ర్య నవోదయం

మూలం :

ఎర్విన్ డి. కాన్‌హామ్

ఎడిటర్ : ది క్రిస్టియన్ సైన్స్ మానిటర్

సోల్ డిస్ట్రిబ్యూటర్.

భారత్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్

కుబేరా బిల్డింగ్స్,

**21, సుంకురామచెట్టి వీధి : మద్రాస్-1.**

# ఉపోద్ఘాతం

గత అర్థ శతాబ్దంలో అమెరికన్ కేపిటలిజాన్ని గురించి అపార్థం చేసుకొన్నంతగా మరేదీ అపార్థం చేసుకోబడలేదు.

యునైటెడ్ స్టేట్స్‌లో పారిశ్రామిక వ్యవస్థ ఎలా రూపొంది పని చేస్తున్నదీ, అన్ని ప్రాంతాల వారు తప్పక తెలుసుకోవలసి వుంది. ఆ విషయాన్ని స్పష్టంగా వివరించడానికి ఒక సామాన్యుడు చేసిన ప్రయత్నం ఫలితమే ఈ పుస్తకం.

యోచనాపరులైన వారు, పెక్కుమంది అమెరికన్లలోని యోచనాపరులు కూడా ఒక మిథ్యను నమ్ముతూ, ఒక గొప్ప సత్యాన్ని గుర్తించలేకుండా వున్నారు. అమెరికన్ సమాజానికి భౌతికవాదం ప్రాతిపదిక అని, అదే సైనిక తత్వంగా ప్రపంచమంతటా వ్యక్తమౌతున్న దన్నదే ఆ మిథ్య.

సమాజం అతి సహజమైన వికాసం చెందడంలో అత్యంత ప్రధానమైన విలువలు ఆధ్యాత్మికమైనవీ, నైతికమైనవీ అన్నదే గొప్ప సత్యం.

వ్యక్తికి అత్యధిక ప్రాధాన్యమిచ్చే ఏ సమాజమైనా అది అమెరికన్ సమాజం పునాదుల వంటివే కలిగి వున్నప్పుడు అవి భౌతికమూ, నైతికమూ అయిన పునాదులనే కలిగిన సమాజం అయి తీరుతుంది.

మానవులు సమాజంలోని నిత్య జీవనంలో ఉన్నతమైన ఆధ్యాత్మిక విలువలను, సూత్రాలను అమలు జరపడంలో అసమగ్రత ఎక్కువగా వుంటుంది. వ్యక్తిగతంగా మన జీవితాలు, సమాజం కూడా అసమగ్రంగానే వున్నవి. స్వాతంత్ర్యంలోని మహత్తర శక్తుల సాధనకు అవకాశం యిందులోనే వుంది. మనం చెయ్యవలసిన కృషి ఎంతో వుంది. మూఢ సిద్ధాంతాల అంధకారంలో మనం మునిగి పోవడం లేదు. స్వయంగా ఒక సవాలును ఎదుర్కొంటూ సమాజాన్ని మెరుగు పరుచుకోవడమే దీని సారాంశం. ఈ నాడు మనం శక్తి కొలది దేనికోసమైతే కృషి చేస్తున్నామో, దానిని రేపు మరింత విశిష్ట మార్గాలలో చెయ్యవచ్చునన్న సంగతి మన కందరకు తెలిసినట్టిదే కదా!

దీనిలో విచిత్ర మేమీ లేదు. మానవుడు విజ్ఞతతో జన్మతః సంపాదించుకొన్న హక్కును, ఈ విశాల విశ్వానికి సంబంధించిన మూల సూత్రాలను గుర్తించి, మానవుని అవసరాలకు అనుగుణంగా వాటిని అసలు జరుపుకోవాలనే చైతన్యంతో సాగిస్తున్న అంతులేని పోరాటమే యిది. ప్రకృతి శాస్త్రవేత్తను, పండితుని, మతాభిమానిని, వ్యాపారస్తుని కార్యరంగంలోకి గొనివచ్చేదిదే. పోటీ పడడంలోని ఆసక్తికి, వ్యక్తి వాదానికి తోడుగా సాంఘిక బాధ్యత కూడా జత పడినపుడు అభ్యున్నతి తథ్యం కదని నే వ్యాపారస్తుని కూడా అతనికి తెలియకుండానే యిది ముందుకు నడిపిస్తుంది.

పెద్ద పెద్ద సంస్థలకు (కార్పొరేషన్లు) అమెరికన్ కేపిటలిజంలో ప్రాబల్యం వున్న మాట నిజం. అయితే వాటి సామ్రాజ్యం బహుళం. వాటిపై కంట్రోలు మేనేజిమెంట్ల పరం. అయినప్పటికీ యిది మేనేజరుల యుగమనడానికి నేను సమ్మతించను. నిజానికి యిది ఆర్థిక శక్తి సమఉజ్జీగా వుంటున్న యుగమని నేను భావిస్తున్నాను. రాజకీయ స్వాతంత్ర్యానికి అధికారం ఒకరిద్దరికులు లేక సమస్థాయిలో వుండాలని మనం ఏనాడో నేర్చుకున్నాం. ఇప్పుడు ఆర్థిక శక్తి విషయంలో కూడా

అటువంటి అనుభవాన్నే పొందుతున్నాం. ఇటువంటి దాని ప్రభావం తరుచుగా పెద్ద సంస్థల పైన వ్యాపిస్తుంది. ఒక వైపున ప్రభుత్వం, మరొక వైపున సుసంఘటితులైన కార్మికులు, స్టాకు హోల్డర్లు, ఖాతాదారులు, ప్రజలు, వీరందరూ ఏదో ఒక విధంగా, ఎంతో కొంతవరకైనా మేనేజర్లకు గల అధికారాలను హద్దులో పెడుతున్నారు.

ఎక్కడి 1900 వ సంవత్సరం? ఇంకా చెప్పాలంటే ఎక్కడి 1937 వ సంవత్సరం? అమెరికన్ ఆర్థిక వ్యవస్థ మీద పెద్ద సంస్థలు గుత్తాధికారం చెలాయించకుండా కార్మిక శక్తి, ప్రభుత్వ శక్తి లేదా యితర వర్గాల శక్తులు వారిస్తున్నవి. ప్లూటో క్రసీ (వ్యాపార వర్గాల పాలన) రూపుమాసింది. సమన్వయం కలిగిన శక్తి ప్రతిష్ఠాపితమైంది.

ఇలా పెద్ద పెద్ద కార్పొరేషన్లపై ప్రసరిస్తున్న పరిణామాల ప్రభావం కాండా నాకు అమెరికా ఆర్థిక రంగంలో ప్రధానాంశంగా కనిపించడం లేదు. ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరం రూపొందించిన వ్యాపారస్తుడు - చిన్న వ్యాపారస్తుడే నాకు బాగా నచ్చుతున్నాడు. చిన్న వ్యాపారస్తుడు-ఒక సంకల్పం కలవాడు; ఒక స్వప్నం పొందేవాడు. నా అభిమానానికి పాత్రుడౌతున్నాడు. ఈ సందర్భంలో

నాకు ఒక ఫ్యాక్టరీ - పెక్కింటిలో గణనీయమైనది - కొంతకాలం క్రితం కాలిఫోర్నియాలో ఒక చిక్కుడు తోటలో స్థాపించబడినది నాకు గుర్తుకు వస్తోంది.

ఒక ప్రముఖ విశ్వవిద్యాలయానికి చెందిన యిద్దరు యువక భౌతిక శాస్త్రజ్ఞులు ఒక ముఖ్యమైన ఎలెక్ట్రిక్ ట్యూబ్‌ను కనిపెట్టారు. ఇది సైనిక ప్రయోజనాలకు ఏ విధంగా ఉపకరించిందో, శాంతి కాలపు ప్రయోజనాలకు కూడా అదే విధంగా ఉపకరించింది. ఆరుగురు పనివారితో వీరు ఒక వర్క్‌షాప్ ప్రారంభించారు. ఆరు సంవత్సరాలకు అక్కడి పనివారి సంఖ్య 600 లకు పెరిగింది. సంస్థ పొందిన అభివృద్ధి ఆశ్చర్యకరమైనదే కాని, ముఖ్య విషయం అది కాదు. ఆ ఇద్దరు భౌతిక శాస్త్రజ్ఞులకు తమ వర్క్‌షాపులో పనిచేస్తున్న వారందరూ తెలుసు. ఆ సంస్థ యాజమాన్యం విశేషంగా పని వారి క్రిందనే వుంది. నాటికి 70 వంతుల వాటాలు, కార్మికులలో నూటికి 60 మంది క్రిందనే వున్నవి. అలా అది వారి ఫ్యాక్టరీ అయింది. అయితే వారు దానిని నిర్వహించరు. ఆ యిద్దరు వైజ్ఞానికులే తమను 'యజమానులు'గా వుండి నిర్వహణ భారం వహించాలంటారు.

అయితే ఈ భౌతిక శాస్త్రజ్ఞులు తమ ఫ్యాక్టరీలో

ఒక కమిటీల పద్ధతిని ఏర్పాటు చేశారు. ఈ కమిటీల ద్వారా ప్రతి కార్మికునకు పనులు యెలా జరుగుతున్నదీ వివరించడానికి, వాటిపై తన అభిప్రాయాలను వెల్లడించడానికి అవకాశం కలుగుతుంది.

ఈ విధమైన వ్యాపారాలు సాంఘిక సమస్యల పరిష్కారానికి చాలా దోహదమిచ్చాయి. స్త్రీలు, పురుషులు కలిసి మెలిసి ఏ విధంగా సుఖంగా, సంతోషంగా ఎక్కువ ఉత్పత్తిని ఎలా సాధించేదీ సూచించాయి. ఇటువంటిది కేవలం ఎక్కడో ఒకచోట చెదురుగా జరిగి వుండలేదు. అమెరికా మొత్తం మీద, సాధారణంగా పెద్ద పెద్ద నగరాలకు వెలుపల పొలాలలో, ఇళ్ళకు, తోటలకు, పాఠశాలలకు, మత దేవళాలకు తగిన స్థలసౌకర్యంగల ప్రాంతాలలో ఇటువంటి సంస్థలు వెలిశాయి. అయితే యిది నిరంతరం అభివృద్ధి చెందడం లేదు. ఆర్థిక రంగంలోని పోటాపోటీలు, ఉప పత్తులు, వీటి మనుగడను కంట్రోల్ చేస్తున్నవి. అయితే ఇటువంటి వ్యాపారాలు ఒక నూతన వాతావరణాన్ని తెచ్చి పెడుతున్నవి. నవ సమాజ సూత్ర మొకటి గణనీయంగా పని చేస్తున్నది. అయితే ఇది పూర్తిగా కొత్తది కాదు. చిరకాలం క్రితం అభివృద్ధి చెందిన పారిశ్రామిక శక్తులకు ఇదొక రకమైన అనుకరణ మాత్రమే.

పూర్వకాలంలో బుద్ధి కుశలత, ఉరవడి ప్రధానంగా వుండేవి. పెత్తందారీతనం, వారానికి 70 గంటల పని, పిల్లల చేత కూడా పని చేయించడం వుండేవి. కాని యిప్పుడలా కాదు. బుద్ధి కుశలతకు, ఉరవడికి సాంఘిక చైతన్యం కూడా జత పడ్డది.

పైన పేర్కొన్న ఇద్దరు యువక భౌతిక శాస్త్రజ్ఞులకు ధనార్జన యిష్టమే కాని, విపరీతంగా ఆస్తి పాస్తులు పెంచుకోవాలనే ఆశ లేదు. అలా తాము ఆస్తి పాస్తులు పెంచుకోవలసిన పని ఏమిటి? తమకు, తమ కుటుంబాలకు సాంఘికావసరాలు చాలా ఎక్కువగానే తీర్చుకోవచ్చు. తమ కుమారులు, కుమార్తెలు తాము సంపాదించి పెట్టే ఆస్తికి కేవలం వారసులై, దాని ననుభవించాలని వారు అభిలషించ లేదు. వారు ప్రయోజనకరమైన, ఉదాత్తమైన జీవితాలను గడపాలనే ఆశించారు. కేవలం డాలర్లు కూడబెట్టుకోవడంలోనే సుఖం లేదని వారు గుర్తించారు. తమ వ్యాపారాభివృద్ధి శ్రేయస్సు తమ సంస్థలోని పనివారి హృదయపూర్వక సహకారం పైన ఆధారపడి వున్నదనే వారు గుర్తించారు. పరస్పర సంబంధమే సాంఘిక శక్తిగా గుర్తించ బడ్డది.

ఇందులో నేను ప్రత్యేకంగా విశదీకరించడానికి ప్రయత్నించిన ప్రధానాంశాలు యివి. ముందు

అధ్యాయాలలో యీ పరిణామాలు, సాగుతున్న ప్రపంచ పరిస్థితుల్ని సమీక్షించాను. అమెరికా ఆర్థిక వ్యవస్థలోని ఈ పరిణామం చిరకాలాను గతమైన మార్పులలోని తుది ఘట్టంగా మనం గుర్తించవలసి వుంది. ఆధ్యాత్మిక, సాంఘిక సత్యాన్వేషణకై మానవజాతి సాగిస్తున్న పోరాటానికి తుది ఫలితమిది. ప్రపంచ విధానానికి సంబంధించిన రెండు సూత్రాలను నేను ఇందులో సూచించాను. మానవులకు, జాతులకు స్వయం నిర్ణయాధికారం ఒకటి; మానవునికి జాతికి మధ్య వున్న పరస్పర బంధుత్వం మరొకటి. నేటి సమకాలీన సమాజానికి ఈ రెండింటిని సాధించడమే అమెరికన్లు చెయ్యవలసిన సేవగా నేను భావిస్తున్నాను.



# 1

యునైటెడ్ స్టేట్స్‌ను గురించి గాని, మరే దేశాన్ని గురించి అయినా గాని మనం మాట్లాడుకొనేటప్పుడు మహా శక్తివంతమైన రాజ్యమని, అగ్రరాజ్యమని అంటూ వుంటాము. అలా అనడంలోని ఆంతర్యమేమి? నైతికంగా గాని, మనోవిధంగా గాని యీ రాజ్యానికి గల బాధ్యత లేమిటి? నేటి ప్రపంచంలో 'మహా శక్తి' అనేది ఏది?

ఈ ప్రశ్నలకు జవాబులు మీకు తెలుసు. ముఖ్యమైనదే అయినప్పటికీ అది కేవలం సైనిక శక్తి కాదు. పటిష్టమైన ఆర్థిక వ్యవస్థ, భౌతిక శక్తి సామర్థ్యాలు కూడా ముఖ్యమే అయినప్పటికీ అవి కూడా 'మహా శక్తి' కారణాలవు. మానవ వ్యవహారాలలో నిజమైన, ప్రధానమైన శక్తి శత్రా

ద్ధానుగతంగా వారి హృదయాలలో హత్తుకుపోయి, ఒకరి హృదయం నుంచి మరొకరి హృదయానికి అవగతమౌతూ వచ్చిన ఆధ్యాత్మిక స్వతంత్ర భావన సంపదగా వర్ణించబడడానికి మనం బహుశా అంగీకరించవచ్చు. ఈ విధమైన స్వాతంత్ర్య భావన సర్వాంతర్యామియైన పరమాత్ముడున్నాడనే చైతన్యాన్ని మానవునకు కలిగిస్తుంది. తాను సర్వదా గుర్తించడానికి సిద్ధపడే నైతిక సూత్రాలనుంచే మానవుని స్వాతంత్ర్య భావన ప్రభవిస్తుంది.

మానవునికి యీ చైతన్యం కలగడంతోనే సరిపోదు. అన్నిటికంటె మిన్నగా, ఒక మహత్తర శక్తిగా యీ స్వాతంత్ర్యమనే దానిని ఒక నిర్ణీతమైన నిర్దిష్టమైన కార్యాచరణకు పెట్టడంలో అనుసరించదగు పద్ధతులను మనం అర్థం చేసుకొని, వాటిని అమలు పరచడానికి సిద్ధపడాలి. ప్రపంచంలోని వారందరూ స్వాతంత్ర్యాధికారాన్ని పంచుకోడానికి వీలిచ్చే ప్రణాళిక ఒకటి మనకు అవసరం. మన మాటలకు, చేతలకు మధ్య గల వైరుధ్యాలను తొలగించడం కూడా అవసరం. మన వాగ్దానాలకు, కార్యాచరణలకు మధ్య గల లోటును తీర్చుకొనడం కూడా అవసరమే.

ఈ ప్రపంచంలో మనం - కేవలం అమెరికన్లు

మాత్రమే గాక-స్వాతంత్ర్యానికి సంబంధించిన సంప్ర దాయాలను ఎంతో కొంతవరకు పాటిస్తూనే వున్న మనం అందరమూ ఒక మహా శక్తివంతమైన విప్ల వాత్మక సూత్రానికి వారసులం. స్వాతంత్ర్య శక్తిని సంతరించుకొన్న మనమే నేటి ప్రపంచంలో విమో చనాన్ని సాధించే నిజమైన విప్లవ యోధులం. మానవ జాతిలోని మూడింట ఒక వంతు ప్రజలపై పోలీసు అధికారాన్ని విధించిన వారికంటె మనలోని అభివృద్ధి నిరోధకులు కూడా విప్లవ యోధులనే చెప్పవచ్చు. నియంతృత్వ వాదులు-వామ పక్షానికి చెందినవారైనా, మితవాదులైనా-నిరంకుశత్వానికి, హింసాత్మక విధానానికి, మానవజాతి చరిత్రలో అత్యంత విషాదకరమైన శక్తులకు వారసులు.

మహా శక్తివంతమైన ఒక విప్లవ సిద్ధాంతం మన చేతిలో వున్నది. దైవ కృపకు, చట్టాల రక్షణకు లోబడిన మానవులలో ప్రతి ఒక్కరి హక్కుల రక్ష ణకు అంకితం చెయ్యబడిన మహత్తరమైన, నిజమైన అధికారం మన చేతిలో వుంది. మనకు, మొత్తం మీద మానవ జాతికి సంబంధించిన యీ విప్లవ సిద్ధాంతం అనేక రూపాలలో వ్యక్తమవుతూ వుంటుంది. ఆకలితో అటమటించే పసికందులకు ఎక్కువగా ఆహారం అందుబాటు చెయ్యడానికిది

తోడ్పడుతుంది. అదనంగా వుంటున్నారని చెప్పబడే జనాభా సమస్యను గురించి ప్రజలు తమకు తామై సమగ్రంగా ఆలోచించుకోనడానికి అవకాశమిస్తుంది. ప్రాతిపదిక విద్యను, అక్షరాస్యతను వారు వ్యాపకం చెయ్యడానికి దోహదమిస్తుంది. ప్రభుత్వ పరిపాలన రీతులను గ్రహించడానికి, ఆర్థిక వ్యవస్థల ప్రయోజనాలను పెంపొందించుకోనడానికి ప్రోత్సహిస్తుంది. ఇవి మాత్రమే గాక, ఇలాంటివి అనేకం యీ విప్లవ సిద్ధాంతంలో గర్భితమై వున్నాయి. వీటి పునాదుల మీదనే మన జాతి, మన సమాజం రూపొందింది. వీటినే మానవులందరూ ఆశిస్తున్నారు.

ఈ సంప్రదాయాన్ని మనం ఎలా వివరించి, నిర్వచనం చెప్పగలం. ఆరంభ దశనుంచీ ప్రారంభిద్దాం. ప్రత్యేకంగా మనం పొందిన చారిత్రికానుభవంలో జుడేయా కొండల మీదనుంచి ప్రవర్థమానుడైన ఒక సర్వేశ్వరుడు – ఒక శాసనం అనే దానితో మొదలు పెడదాం. సర్వేశ్వరుని గురించి, శాసనాలను గురించి ఇలా రూపొందిన జుడాయిక్ సూత్రాలే నేటి మన సమాజానికి పునాది రాళ్లు. దశ సూత్ర బోధనలకు – మనం అక్షరాల కట్టుబడే మన జీవితాలను నిరంతరం కొనసాగించలేము. తరుచుగా మనం దొంగ దేవతలను సృష్టించు

కొంటూ వుంటాం. అయితే మనకు ఒక ఆధారం, ఒక నియమావళి, దైవత్వానికి సంబంధించి, సుస్థిరతకు ప్రాతిపదికమైన నైతిక సూత్రం ఒకటి వుంది. ఇలాగే మరికొన్ని మతాలు వున్నాయి. మరికొన్ని ఆధ్యాత్మిక సూత్రాలున్నూ వున్నాయి. ప్రధానమైన ఈ సిద్ధాంతాలు లేని పక్షంలో మన మానవ సమాజం, ప్రభుత్వం, మన ఆర్థిక, సాంఘిక వ్యవస్థలు విచ్ఛిన్నమై పోగలవు.

ఒక సమాజంలోని వారందరూ ఆ సామాజిక వ్యవస్థ పని చెయ్యడానికిగాను కేంద్రాధికారాన్నీ, శాసనాధికారాన్నీ ఆమోదించవలసిన పనిలేదు. కాని అధిక సంఖ్యాకులు మాత్రం ఆమోదించి తీరాలి. మనం కోరిన విధంగానే ఆ వ్యవస్థ వ్యక్తీకరించబడవలసిన పని కూడా లేదు. స్వాతంత్ర్య పథంలో పయనించే సమాజానికి సంబంధించిన పద జాలం ఒక్కొక్కప్పుడు సన్యమై, దిగ్భ్రమ కలిగించినప్పటికీ, దైవభావం, శాసనోద్దేశం అన్ని సందర్భాలలోను ఒకే రీతిగా వుంటుంది. అయితే ఏ సమాజానికైనా స్వాతంత్ర్యమే వుండాలంటే కేంద్రీకృతమైన ప్రాతిపదిక ఒకటి అవసరం. మనకు సంబంధించిన విషయంగా చెప్పుకోవాలంటే హీబ్రూ ప్రవక్తలకు దేవుడు, శాసనం అనే భావాలు కలగడం, ఆ

ప్రవక్తల సూక్తులనుంచి కలిగిన అనుభవాలు, హృదయాన్ని కదిలించే ప్రార్థనలు, వారి ఉత్తేజకరమైన హెచ్చరికలు జతపరచినపుడు బ్రహ్మాండమైన మన సాంఘిక వ్యవస్థకు అవి అన్నీ ప్రాతిపదికగానే వుంటాయి.

ఇలా జుడాయిక్ సూక్తుల ద్వారా ఏర్పడిన పునాదులకు తోడు క్రైస్తవ ప్రబోధాలను మనం పొందాం. విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని గురించి నేర్చుకున్నాం. క్రీస్తు జీసస్ జీవితంలో మానవతకు, దైవత్వానికీ మధ్య గల సంబంధాన్ని కనగలిగాం. అన్నిటిని అధిగమించగలిగిన మార్గాన్ని కనుగొన్నాం. మించి, మన సమాజంలోనికి మొత్తం మానవ జాతినే ఆహ్వానించాం. దేముడు – శాసనం–సోదర భావం! ఎంతటి మహామహిమాతిశయం గల భావ త్రయం! వీటిని ఆచరణ సాధ్యమైన, సాంఘిక, రాజకీయ పదజాలంలో వ్యక్తీకరించి నప్పుడు, వాటి ద్వారా క్రమబద్ధమైన, స్వతంత్రమైన, శక్తివంతమైన, దినదిన ప్రవర్థమానం కాగల సమాజం రూపొందగలదు.

దీనితోనే ముగియలేదు. గ్రీక్, రోమన్ అనుభవాలను, కాంతి రేఖలను కూడా మనం అందుకొన్నాం. తద్వారా నిర్మాణాత్మకమైన, క్రమాను

గతమైన సాంఘిక విధానాలను, సత్యాన్ని, యోచనా శక్తిని, సృజనా శక్తిని, ఆలోచనకు తావీయగల ప్రశ్నల నడిగే నేర్పును, ఆధ్యాత్మిక భావ సందీప్తములైన సమాధానాల నీయగల ప్రతిభను పెంపొందించుకొన్నాం.

ఈ విధంగా మనం చరిత్రాత్మకమైన అనుభవాలను పొందుతూ వున్న సమయంలో పెక్కు శతాబ్దాల క్రితం పశ్చిమ యూరోప్‌లో శోభాయమానమైన విభిన్నత్వంతో మానవత విజృంభణను, పునరుజ్జీవనాన్ని, మనం అనుభవించాం. పుష్కలమైన సంపదలకు, హద్దులేని అవకాశాలకు నిలయమైన ఈ నవ ప్రపంచానికి స్వేచ్ఛా కాముకులైన ప్రజలు తండోప తండాలుగా వచ్చి పడసాగారు. ఈ నాటికీ మన శ్రేయోభివృద్ధులకు అనుగుణమైన ఈ మానవ సంపద వచ్చి పడుతూనే వుంది.

మనం నివసిస్తున్న ఆధ్యాత్మిక మందిరం (దేశం) ఈ శక్తులనుంచి, తదితర శక్తులనుంచి అవతరించింది. మన భావ సంపద కిదే పరిధి. దీనిని ఏకం చేసి, రాజకీయ, ఆర్థిక, సాంఘిక పరిభాషలో చెప్పుకొన్నపుడు యిది ఒక మహోజ్జ్వల విప్లవ శక్తిగా రూపొందుతుంది. ఈ వ్యవస్థ మానవునికి కేవలం వ్యక్తికి-అతని వికాసానికి అంకితమైంది. ఇది చాలా

చైతన్య వంతమైంది. తాను సేవ చేస్తున్న మానవులకు మరింతగా సేవ చెయ్యాలనే సంకల్పంతో- నిర్విరామంగా కృషిని కొనసాగింపజేసే వ్యవస్థ యిది.

ఈ విప్లవం మనది. అంటే ఒక్క అమెరికను లదే కాదు, అన్ని జాతులవారిదీని. మానవునికి స్వతస్సిద్ధంగా లభించవలసిన హక్కులు ప్రాతిపదికగా గల మన ఈ విప్లవం ప్రపంచ నాయకత్వం వహించవలసి వుంది. గతంలో పెక్కు సంవత్సరాలుగా చేస్తున్నట్లుగానే ఈనాడు కూడా యీ విప్లవం మానవ హృదయాకాశ వీధులలో దివ్య జ్యోతులను వెలిగించాలి. అదే నిజమైన విప్లవంగా గుర్తించబడాలి కూడా.

ఇలా చెయ్యడానికి బదులు విప్లవానికే జీవితాలను అంకితం చేసుకొన్న మనం తరుచుగా ప్రతీప శక్తులకు లోబడి పోతున్నాం; తిరోగమిస్తున్నాం; ప్రబోధకులం కాలేక పోతున్నాం. యథాస్థితిని సమర్థించే దుర్భర భారంతో క్రుంగి పోతున్నాం. స్వతంత్రులైన మానవులు ఎప్పుడైనా యథాపూర్వ స్థితితో సంతృప్తి చెందగలిగారా? మన వర్తకులు, మన వ్యాపారస్థులు విప్లవ వ్యతిరేకులని, అభివృద్ధి నిరోధకులని తరుచు అంటూ వుంటాం. కాని వారిలో ఎవరైనా తను వ్యాపారంలో యథా

స్థితితోనే సంతృప్తి చెందినట్లు మీరు కనుగొన గలిగారా? మీకు ఆ విధంగా యథాస్థితితోనే సంతృప్తి చెందినట్లు కనిపించే వ్యాపారస్తుడు రంగంలో చాలాకాలం నిలబడలేడు. మన పారిశ్రామిక వ్యవస్థకు నిత్యం యథాస్థితినుంచి ఏర్పడే సవాలును ఎదుర్కొంటూ, రేపు మరింత విశిష్టంగా వ్యాపారం నిర్వహించడ మెలాగ అనే తపనే ప్రాతిపదిక ఔతున్నది. ఇంకా అనేక విధాలుగా సమర్థతతో ఈ సవాలును ఎదుర్కొనడమే మన కర్తవ్యమౌతున్నది. చివరకు అనేక విధాలుగా స్థిరంగా వుండే ప్రభుత్వం విధానాలలో కూడా కొత్త కొత్త ప్రయోగాలు చెయ్యడం, కొత్త పద్ధతుల్ని ప్రవేశపెట్టడం, మార్పులు చెయ్యడం అవసరమని కనుగొన్నాం.

అయితే నేను యింతకు ముందే చెప్పినట్లు మనం ఏ శక్తివంతమైన విప్లవానికి అంతర్భాగంగా వున్నామో, ఆ విప్లవం యిప్పుడు అపోహలతో అణగి మణగి పోయివుంది. ప్రపంచంలో మనం నిర్వహించవలసిన బాధ్యతను మనం సరిగా ఆకళింపు చేసుకోలేదు. మనం సమర్థులం కామనే సందేహం ఒకటి బాగా పీడిస్తూ వుంది. ఉన్న పరిస్థితిని సమర్థించుకొనే బరువు భారంతో క్రుంగిపోయి వున్నా

మనే మనలో చాలామందిమి అనుకొంటున్నాం. మన లోనే ఏవో లోపాలున్నాయని, నిజమైన శక్తి యాటం బాంబుల్లోనో, లేక హైడ్రొజన్ బాంబుల్లోనో, లేదా పెద్ద ఫ్యాక్టరీలు, గనులలోనే కలదనో భావించే పరిస్థితిలో వున్నాం. మన ఔదార్యం మూలంగా కలిగిన నిరుత్సాహానికే తత్తరపాటు చెందుతున్నాం. మన సహాయంపై ఆధారపడివున్న దేశాలు ఇంకా ఇంతకు మించిన అపోహలలో మునిగి వున్నాయి. అవి తమ స్వశక్తి మీదనే ఆధారపడ దలిచాయి. తమ ఆత్మ గౌరవాన్ని పునరుద్ధరించుకో గోరు తున్నాయి. తమ్ము గౌరవంగా, పచుందాకు లోపం రాకుండా చూడాలని అభిలషిస్తున్నాయి. మనం నివసిస్తున్న అస్థిర పరిస్థితులలోనే అవి అమెరికా నుంచి తమకు అవసరమైన సహాయాన్ని కోరుతున్నవి కూడా.

## 2

ఈ అపోహలను తొలగించడానికి మనం ఎక్కణ్ణుంచి పని ప్రారంభించాలి? ముందుగా సుబోధక మైన ప్రాతిపదిక సిద్ధాంతాలను–ఫిలడల్ఫియాలోని వారు – గెట్టీస్ బర్గ్‌లోని ఒక వ్యక్తి, చతుస్స్వాతంత్ర ప్రణాళికా రచయిత చేసిన విధంగానే వివరిస్తూ,

ఆ తర్వాత వాటికి కార్యక్రమాల రూప మివ్వడమే సముచిత మార్గం కాగలదని నేను భావిస్తున్నాను.

ప్రపంచం పట్ల మన విధానాన్ని నిర్ణయించు కోడానికి ముఖ్యమైనవి రెండే రెండు సూత్రాలు - రెండు సిద్ధాంతాలు - లేదా రెండు భావాలు వున్నాయి. ఇందులో మొదటిది స్వయం నిర్ణయాధి కారం. రెండవది-ఈ అర్ధ శతాబ్దంలో ఎక్కువగా గుర్తింపుకు వచ్చినది - ఒకరిపై ఒకరు ఆధారపడి వుండడం. దీనినే పరస్పర సంబంధంగా పేర్కొన వచ్చు.

స్వయం నిర్ణయాధికారం, పరస్పర సంబంధం- అనే ఈ రెండూ ప్రధానమైన రాజకీయ భావాలు కాదా? వీటి పరిధులకు సరిపోగల చక్కని కార్య క్రమాన్ని రూపొందించుకో కూడదా? మానవ జాతి విమోచనకు, వేర్వేరు జాతుల మధ్య సుస్థిర సంబంధాల సంస్థాపనకు తగిన శక్తి వీటికి లేదా? మన సమాజం, మన మిత్రుల సమాజాలు రూపొంద డానికి కారణభూతమైన మహత్తర భావాలను యివి వ్యక్తీకరించడం లేదా? అవి ఈ నాటికి పనికిరాగల అనుబంధ సూత్రాలు కావా?

స్వయం నిర్ణయాధికార సూత్రంలో మహత్తర చైతన్యం గర్భితమై వుంది. మన శతాబ్దంలోనే యిది

మానవుల హృదయాలను ఆకట్టడాన్ని చూడ గలిగాము. ఉడ్రో విల్సన్ వివరించిన విధంగానే ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరం తూర్పు, మధ్య యూరోప్‌లనుంచి అదుపు చెయ్యడానికి వీలులే నంతటి ఆవేశాలను అది రెచ్చగొట్టింది. ఈ నాటిక్ వలస దేశాల ప్రజల విప్లవాల ద్వారా, అందు లోను వెనుకబడివున్న - అభివృద్ధి చెందని దేశాలలో అది కానవస్తున్నది. (ఈ దేశాలు వెనుకబడి వున్నట్లు చరిత్రలో యిప్పుడు మాత్రమే కనిపిస్తున్నది) ఒకప్పుడు కొరియా, ఈజిప్ట్, ఇండియాలలోను, ఆఫ్రికాలోని కొన్ని ప్రాంతాలలోను మన పూర్వీకులు సగర్వంగా చెప్పుకొనగలదానికంటె ఎక్కువైన నాగరికతలే వెల్లి విరిశాయి. కొరియానుంచి వచ్చిన మిత్రులతో మాట్లాడినపుడు, వారు అక్కడి వెనుక బడివున్న పరిస్థితి పట్ల ఆశ్చర్య విభ్రమలను ప్రకటించి నప్పుడు, జోహాన్స్ గుటెన్‌బర్గ్ సిరాపూసి ప్రూఫు లను తీయడానికి చాలకాలం ముందే కైపులనుంచి అచ్చువేసే పద్ధతిని కొరియనులు కనుగొన్నారనే సంగతి, యూరోప్‌లోని కొందరు మేధావులు పూర్వ కాలపు మత గురువులు లిఖించిన తాళపత్ర గ్రంథాలను చదవడానికి పూర్వమే కొరియాలో

ఇంటింట ఒక గ్రంథాలయం వుండేదన్న సంగతి నాకు గుర్తుకు వచ్చాయి.

నేడు అణగారిపోయి వెనుకబడివున్నవారు ఇటువంటి తమ ప్రాచీన వైభవ ప్రాభవాలు స్ఫురణకు వచ్చినపుడు తాముకూడా స్వేచ్ఛా సంతోషాలను అనుభవించగల సుదినాలకోసం ముందుకు దూకుతున్నారు. వీరికి జ్ఞాపకం వస్తున్నది తమ పూర్వపు వైభవోన్నతులు మాత్రమే కాదు. ప్రపంచంలో ఎచ్చ టెచ్చట ఏమి జరుగుతున్నదీ వీరు తెలుసుకొంటున్నారు. ఈ నాటి ప్రజలు ప్రకృతితో కొత్త సంబంధాలను సాధించిన సంగతిని వీరు తెలుసుకొన్నారు. కష్టించి పని చెయ్యవలసిన భారాన్ని స్త్రీ పురుషుల, బిడ్డల భుజ స్కంధాలనుంచి తప్పించడానికి, ప్రజల హృదయాలను క్రమ్ముకొనివున్న అజ్ఞాన తిమిరాలను పటాపంచలు చెయ్యడానికి కూడా కృషి జరుగుతున్న సంగతి వీరికి తెలుసు.

క్షుధార్తులైన ఈ బడుగు దేశాల ప్రజలకు తమ విముక్తికి మార్గం కలదనే ఆశ కలిగింది. ఇది స్వయం నిర్ణయాధికారంలో అంతర్లీనమైన మహోధృత శక్తినుంచే ఆవిర్భవించింది. ఇది ప్రపంచానికే చిచ్చు ముట్టించగలదు. జాతీయతే దీనికి పునాది. అధికార ప్రాబల్యం కోసం సాగే పెనగులాటలో

కమ్యూనిజాన్ని ప్రతిఘటించి, దానిని ఓడించివేయ గల శక్తి కల రాజకీయ భావం–స్వాతంత్ర్యం అనే మూలసూత్రం కాక మరేదైనా వున్నదా అంటే అది జాతీయత మాత్రమే. అయితే రానురాను దీని పైన మోజు తగ్గింది.

పరస్పరంగా ఆధారపడి వుండడమనే సంగతితో నిమిత్తం లేనపుడు ఇది అంతర్జాతీయ అరాచకానికి దారి తీస్తుంది. కాని జాతీయంగాను, వ్యక్తిగతం గాను ఒకరిమీద ఒకరు ఆధారపడి వున్నారనే గుర్తింపుతో వ్యవహరించినపుడు అదొక సమాజ రూపాన్ని పొందుతుంది. కనకనే ఈ జాతీయత లోని మహత్తర శక్తిని ప్రపంచ విమోచనానికి సాధనంగా వినియోగించుకోవలసి వుంది.

స్వచ్ఛమైన, ఉదాత్తమైన జాతీయతకు, కపట మైన, విదేశ వ్యతిరేకమైన, అహంభావపూరితమైన జాతీయతకు మధ్య గల వ్యత్యాసాన్ని కొందరు మేధావులు గుర్తించని కారణాన ప్రపంచ ప్రజల మధ్య సుహృద్భావానికి కలిగినంత అపచారం మరి దేనివల్లను జరగలేదు. గర్వించదగ్గ కాలిఫోర్నియా పౌరులకు, ఉత్సాహవంతులైన టెక్సాస్ పౌరులకు, ప్రతిభావంతులైన న్యూ ఇంగ్లండు పౌరులకు మన జాతిలో ఏ విధంగా సముచితమైన స్థానం వున్నదో

అదేవిధంగా నానాటికి సమన్వయం పెరుగుతున్న ప్రపంచంలో వాస్తవికమైన జాతీయ భావనకు తగిన స్థానం ఎల్లప్పుడూ వుంటుంది. జాతీయత అనేది తన చరిత్ర పట్ల చైతన్యం, ప్రియతమమైన తన మాతృభూమి పట్ల అభిమానం, ఉన్నత ప్రమాణాల పట్ల మక్కువ కావచ్చు. స్వాతంత్ర్య పరిరక్షణకు అవసరమైన రాజ్యాంగ బద్ధమైన సూత్రాలకోసం గట్టిగా పట్టుపట్టడం కావచ్చు. సర్వసత్తాక ప్రతిపత్తి అనేది వినియోగించదగ్గది కాని, నిల్వ చేసుకో దగ్గది కాదని ఎవరో బహు చక్కగా చెప్పారు. అది విచ్ఛిన్నం చేసుకోవలసినది కాదని కూడా అన్నారు. జాతీయత (నేషనలిజం) విషయంలో కూడా యింతే. దానిని మనం - మన పరిస్థితులను, మనతోటి ప్రజల పరిస్థితులను చక్కబరుచుకొన డానికి ప్రాతిపదికగా, తార్కాణంగా, కీలకంగా, శక్తిగా, పటిష్ఠమైన రక్షణగా వినియోగించు కొందాం. మానవుల ఆశలు, అనుభూతులు, సంస్థలు మొదలైన వాటి ఉపరితలాలను గాక, వాటి మూలస్థానాల రక్షణకే వినియోగిద్దాం. జాతీయతను విమర్శించడం ద్వారా మానవుల ఆలోచనల మధ్య సహకార సమన్వయాలను సాధింపజాలము. దానిని సాంఘిక, రాజకీయ వ్యవస్థలకు, పరస్పర సంబంధాల

వ్యాపకానికి అనుగుణంగా ఉపయోగించినప్పుడు, అమూల్యమైన రక్షణలను, విలువలను కోల్పో తున్నామని భయాందోళనలు పడుతున్న వారి మనస్సులలోని అపోహలు తొలగిపోగలవు.

అయితే జాతీయతలో కంటె స్వయం నిర్ణయాధికారంలోనే మరింత శక్తి వున్నది. వ్యక్తికి స్వయం నిర్ణయాధికారం వుంది. అంటే తనకేది యిష్టమో దానిని కోరుకొనే హక్కు, రాజకీయ సంస్థల ద్వారా తన అభిప్రాయాన్ని వ్యక్తీకరించే హక్కు, ఒకరి హక్కులకు మరొకరి హక్కులను జతపరచి సాంఘిక సమైక్యాన్ని సాధించే హక్కు, వ్యక్తికి లభిస్తాయన్న మాట. సాంఘిక సమైక్యత దీనిలో చేరివున్నందున ఒకరిపై ఒకరు ఆధారపడి వుండడమన్న దానితో ఈ హక్కు జతపడుతూ వుంది. క్షుధార్తుడైన వ్యక్తికి స్వయం నిర్ణయాధికారం కేవలం నిష్ప్రయోజకంగా తోచవచ్చు. స్వయం నిర్ణయాధికార మార్గం, పరస్పర సంబంధాల మార్గం ఆహారాన్ని, భౌతిక సంక్షేమావకాశాలను ఎలా లభింపజేయగలవో, పరిపుష్టమైన ఆర్థిక వ్యవస్థను ఎలా దారితీయగలవో సూచించడం అవసరం.

కాగా స్వయం నిర్ణయాధికారం, పరస్పర సంబంధం అనే రెండు మూలసూత్రాలను కార్య

రూపంలో పెట్టవలసిన సమయ మిప్పు డాసన్న మైంది. ఆకలితో బాధపడుతున్న వ్యక్తిని ఆకర్షించే దిదే. మన వాగ్దానాలకు, వాటిని నెరవేర్చడానికి మధ్యగల వ్యత్యాసాన్ని కలిగించగలిగిన దిదే. ఇంతకు ఈ రెండు భావాలను ఆచరణలో పెట్టా లంటే ఎటువంటి కార్యక్రమాన్ని రూపొందించు కోవాలి?

# 3

అన్ని తరహాల మహత్తర భావ ధోరణులు ఒక ప్రణాళికతో ప్రారంభమైనాయి. కనుక నేను కూడా ఆ పద్ధతిలోనే ప్రారంభిస్తాను. అమెరికా దేనికి అంకితమైందో, దాని ప్రత్యేకత ఏమో స్పష్టీక రించుకోనడంతోనే బయలుదేరుదాము. విప్లవాత్మ కమూ, విమోచన సాధకమూ అయిన స్వాతంత్ర్య సిద్ధాంతానికి, ఒకరి శ్రేయస్సు సర్వజన శ్రేయోభి వృద్ధులపైనే ఆధారపడిన ప్రపంచ వ్యవస్థలో - వ్యక్తుల కేమి, జాతుల కేమి తమ అభిష్టాను గుణంగా వ్యవహరించే హక్కు కలిగించడానికే అమెరికా అంకితమైంది.

సరే. ఇలా ఒక ప్రణాళిక తయారు చేసు కొన్నాం. ఆ తరువాతి సంగతి ఏమిటి? ఏ దేశాని

కైనా, దేశాలకైనా దురాక్రమణ ఆత్మహత్యా సదృశ మనిపించడానికి తగినంతగా మనం, మన మిత్రులం, సైనిక స్తోమతను పెంపొందించు కొంటు న్నాము. ఆయుధ ధారణను మనం ఇంకా కొన సాగించవలసిందే. మనకు ఏ రకం ఆయుధాలు కావాలి, ఏవి పాతబడిపోయినవి - అనేటటువంటి సమస్యలనేమి, మన మిలిటరీ నాయకుల స్పర్థలకు, అసమగ్రతకు, ఈర్ష్యకు, స్వప్రయోజనపరత్వానికి సంబంధించిన సమస్యలను ప్రెసిడెంట్ ఐసెన్‌హోవర్ విజ్ఞతతో ఎదుర్కొనవలసిందే. ఈ విధంగా మనం ముందు మన ఇంటిని నిర్మాణాత్మకమైన శాస్త్రీయ ధోరణిలో క్షాళితం చేసుకోవాలి. ఏనాడో జరగ వలసిన పని యిది. ఇప్పుడు జరుగుతూ వుంది.

అలా చేస్తూనే యునైటెడ్ స్టేట్స్ తన ఆర్థిక వ్యవస్థను సంరక్షించుకోవాలి. సౌష్టవం చేసుకో వాలి. ఇక్కడి ఆర్థిక వ్యవస్థ విచ్ఛిన్నమైందంటే స్వతంత్ర ప్రపంచ రాజ్యాలు మహానర్థకరమైన పరిస్థితిని ఎదుర్కొనవలసి వస్తుంది. అంటే మన ఆర్థిక వ్యవస్థను యిప్పటి ద్రవ్యోల్బణపు ధోరణి లోనే నిరంతరం నడుపుతూ వుండాలని అర్థం కాబోదు. ఆయుధ నిర్మాణంపైనే మన అభ్యున్నతి ఆధారపడి వుండడం అవాంఛనీయం. సాంఘికంగా

నేమి ఆర్థికంగా నేమి లాభదాయకం కాగల ఉత్పత్తి కార్యక్రమం అమెరికాలోను, ప్రపంచం లోను కూడా ఎంతో వుంది.

అమెరికా ఆర్థిక వ్యవస్థ పటిష్ఠంగాను, విజ్ఞతా పూర్వకంగాను వుంటూనే, విదేశాలలోని మన మిత్రుల ఆర్థిక వ్యవస్థతో సమన్వయం కలిగివుండే టట్లు చూడాలి. ఆర్థిక సహాయం చెయ్యడం కంటె అధికంగా వాణిజ్యం చెయ్యడమే సముచితం కాగల దనే మాటను మనం తరుచుగా వింటున్నాం. అమెరికా మరింత స్వతంత్ర వాణిజ్య విధానాన్ని అనుసరించినపుడు—మనం సముదార హృదయంతో ఏ దేశాలకైతే సహాయం చెయ్యలేక పోయామో, ఆ దేశాలు ఆత్మగౌరవ పునరుద్ధరణకు, ఆర్థిక సౌష్టవ పునరుద్ధరణకు విశేషంగా సహాయపడినట్లు కాగలదు. ఇతర విషయాలలో కంటె వాణిజ్య విషయాలలోనే పరస్పరంగా ఆధారపడి వుండవలసిన ఆవశ్యకతను మనం నిరూపించుకోవలసి వున్నాం.

ఆధ్యాత్మిక పునరుజ్జీవనం, భౌతిక బలం, ఆర్థిక స్తోమత — ఈ మూడింటిని ప్రాథమిక చర్యలుగా పేర్కొనవచ్చు. అయితే యివి దీర్ఘకాలిక సమస్యల పరిష్కారానికి దోహదమిచ్చే మాయజాలవు. కనకనే

మనం తిరిగి ప్రణాళికను, దాని నాచరణలో పెట్టదగు మార్గాలను పరిశీలించ వలసిన స్థితిలో పడుతున్నాం.

ప్రపంచంలో నేడు కానవస్తున్న విషమస్థితి ఏమిటి? విభేదాలేమిటి? ఇది కమ్యూనిస్టులకు మనకు మధ్య ఏర్పడిన విషమ స్థితికాదు. నిర్నిబంధ స్వపరిపాలన సాధనకు కట్టుబడిన వారికి, ఆ విష యంలో నమ్మకం లేనివారికి మధ్య ఏర్పడిన విషమ స్థితే యిది. మన ప్రపంచం మూడు భాగాలుగా విభాగితమై వుంది. ఒక కొసను మనం వున్నాం. మనది అతి స్వల్పమైన మైనారిటీ. మరొకకొసను కమ్యూనిస్టులు యిదే విధమైన స్థితిలో వున్నారు. పార్టీ సభ్యులను మాత్రమే లెక్కకు తీసుకొంటే స్వల్ప మైనారిటీగాను, కేవలం అధికారంలో వున్న వారినే పరిగణించే పక్షంలో ఇంకా స్వల్పమైన మైనారిటీగాను వున్నారు. ఈ రెండింటికి మధ్యనే మానవులలో అత్యధిక సంఖ్యాకు లున్నారు. వీరిలో కొందరు పశ్చిమ యూరోప్ పౌరులవలె మనవైపు మొగ్గుతూ వుండడమేగాక, మన మనంతంగా ఋణ పడివున్న చిరంతన స్వాతంత్ర్యానుభవాన్ని కలిగి వున్నారు. వీరిలో కమ్యూనిస్టుల వైపు మొగ్గుతున్న వారు కొందరున్నారు. చాలా మంది ఎటు మొగ్గ వలసినదీ నిశ్చయించుకోలేకుండా వున్నారు కూడా.

ఈ రెండు కొసలకు మధ్య వున్న ప్రజల చేతుల్లోనే ప్రపంచంలోని అధికారాన్ని సమస్థాయిలో-ఒడుదుడుకు పరిస్థితు లేర్పడకుండా వుంచే శక్తి వున్నది.మత ప్రవక్తలు ప్రదర్శించే మహోత్సాహంతో-కమ్యూనిస్టులు వీరితో మంచితనానికి మంత నాలుసాగిస్తున్నారు. వాగ్దానాలు చేస్తున్నారు. లాలిస్తున్నారు. మనలో మనం ప్రదర్శించుకొంటున్న స్పర్థలు వీరికి దిగ్భ్రమ కలిగిస్తున్నాయి. వీరిలో యూరోప్ కు వెలుపల నివసిస్తున్నవారు - ఒకనాటి వారి కలోనియల్ పాలకులతోగాని, ప్రస్తుతపు పాలకులతోగాని మనం ఏవో సంబంధాలు పెట్టుకొనడం, ఒడంబడికలు చేసుకొనడం చూసి నిశ్చేష్టులౌతున్నారు.

ఇటువంటి వారికి మనం అంతర్భాగంగా వుంటున్న వ్యవస్థను, దాని విలువలను, వారి అవసరాలకు, అనుభూతులకు తగినట్లు ప్రయోజనకరంగా మార్చవచ్చుననే విశ్వాసాన్ని వీరిలో మనం పెంపొందించవలసి వున్నాం. అయితే మనం ఒక తప్పు చేశాము. మన వ్యవస్థను దాని ఆర్థిక, రాజకీయ ప్రాతిపదికలతో యథాతథంగా విదేశాలకు కూడా ఎగుమతి చెయ్యవచ్చునని భావించుకోవడమే ఆ తప్పు. మన అనుభవం విశ్వజనీనమైనది. ప్రపంచానికి దేనినైతే

మనం తారాణంగా ప్రదర్శిస్తున్నామో అది కేవలం మన చరిత్రమీద, మన అనుభవంమీద, మన అభిమతాలపైన, మన పరిస్థితులపైన మాత్రమే ఆధారపడివుంది. మనం ఈ నాడు చెయ్యగలుగుతున్నది శతాబ్దాను గతికమైన పోరాట ఫలితం. మన సుదీర్ఘ సమరంలో అనేక గుణపాఠాలు నేర్చుకొన్నాం. మనకు మాత్రమే నిర్దిష్టమైన ఈ పథకం ఇతరులకు సరిపడదు. కనక మన తారాణాన్ని యితరులకు చూపి, వారికి ఉత్తమంగా, యుక్తంగా తోచిన పద్ధతిని నిర్ణయించుకొనే అవకాశాలను - పరిశోధనలు, ప్రయోగాలు చేసుకొనే అవకాశాలను కలిగించడమే మనం చెయ్యగల పని. అయితే అనుభవమనేది ఒక జాతినుంచి మరొక జాతికి లభించదగు మార్గాలను సూచించగలదు.

స్వతంత్ర సమాజం వికాసం చెందడమనేది అనేక అంతర్గత భాగాలమీద ఆధారపడి వుంటుంది. అనుభవ హీనులైన ప్రజలు కలోనియలిజంలోని క్రమ శిక్షణ వలయంనుంచి యిప్పుడిప్పుడే బయట పడుతున్నారు. తమ స్వాతంత్ర్య పరిరక్షణ మార్గాలను వారు తెలుసుకొనడంలో మనం ఏ విధంగా తోడ్పడగలం? తన వివిధ శాఖల ద్వారా మిత్ర రాజ్యసమితి ఈ బాధ్యతను నెరవేర్చవచ్చు. మిత్ర

రాజ్యసమితి అప్పుడే ఈ పనిని ప్రారంభించింది కూడా. ప్రజలను హడలగొట్టడానికి గాక కాపాడ డానికి వీలుగా ఒక పోలీస్ పద్ధతిని నిర్వహించగల శక్తివంతమైన నిపుణుల జట్టును అది నియమించ వచ్చు. ఏ అనుభవ శూన్యులైన ప్రజల రక్షణకు ఈ పోలీసు బలం నిర్దేశించబడిందో, ఆ ప్రజల పై ఖరులను, అభిమతాలను, సమస్యలను పరిశీలించ గల నిపుణులు కూడా పోలీసు నిపుణుల జట్టులో వుండాలి.

అనుభవం లేని ప్రజలకు, అవసరం వున్న ప్రజ లకు అనువుగా పోలీసు దళాలను ఈ నిపుణులు ఏర్పాటు చెయ్యవచ్చు. ఇటువంటి ప్రయత్నం చేసి నపుడు ప్రజల సర్వసత్తాక ప్రతిపత్తికి భంగం కలగవలసిన పనిలేదు. కలోనియలిజం అవశేషాలు దీనిలో వుండబోవు. అది చెయ్యదగు సాంకేతిక సహాయం ఉదాత్తంగా, విజ్ఞతా పూర్వకంగా వుండ

న్యాయ సమ్మతంగా, విశిష్టంగా పన్నులు వసూలు చెయ్యడానికి, పాఠశాలల నిర్మాణానికి, విద్యుచ్ఛక్తి, ఇరిగేషన్ సౌకర్యాలు, సివిల్ సర్వీసుల ఏర్పాటుకు కూడా యిదే విధానాన్ని అనుసరించ వచ్చు. ఇవి అన్నీ నిపుణులు పరిశీలించదగ్గ సాంకే

తిక సమస్యలు. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కల సమాజానికి ఇవి 'పడుగు పేకల' వంటివి.

ఇక ఆర్థిక నిర్మాణానికి సంబంధించి గత అర్ధ శతాబ్దంలోను మనం మన ఆర్థిక వ్యవస్థలో తెచ్చుకొన్న మార్పులను గుర్తించవలసి వున్నాం. (ఈ మార్పులను గురించి మీరు తరువాతి పేజీలలో చదువగలరు.) ఈ అర్ధ శతాబ్దంలోను కేపిటలిజం అని పేరొందనబడే స్వేచ్ఛా వాణిజ్యం, పలుకుబడి కల వ్యాపార సంస్థల దశనుంచి, వికేంద్రీకృతమైన యాజమాన్యపు వ్యవస్థగా మన ఆర్థిక వ్యవస్థను మార్చుకున్నాం. ఈ క్రొత్త వ్యవస్థను 'స్వేచ్ఛాయుతమైన సమష్టి వ్యవస్థ' అనే నేను పిలువ దలచాను. ఐచ్ఛికమైన ప్రయివేటు వ్యవస్థలు (ఆర్గనై జేషనులు) అనేకం దీనిలో వ్యాపించి, అన్నిరకాల అవరోధాలను విచ్ఛిన్నం చేసి, నైపుణ్యాన్ని అందరూ పంచుకొనే అవకాశాన్ని ఈ వ్యవస్థ కలిగించింది.

వృత్తి విషయంలో నేమి, ఆర్థికంగా నేమి, దేనినైనా 'నిల్వ' చేసుకొనడం కంటె 'పంచుకొనడమే' యుక్తమనే విషయాన్ని మనం నేర్చుకొన్నాము. వ్యాపారం రహస్యమనేది ఏదీ యిక లేనే లేదు. ఒక పథకం, ఒక కార్యమనేది నిర్దిష్టంగా ఏదీ లేనప్పటికీ సహకారం విశేషంగా పెంపొందడానికి

అవసరమైన సంబంధాలను ఏర్పాటు చేసుకొన్నాం. మార్క్సిస్టులు చెప్పే సమష్టితనం కంటె, గుత్త వ్యాపార సంస్థలకంటె కూడా మనం ఏర్పాటు చేసుకొన్నదే ఉత్తమ ప్రత్యామ్నాయ మార్గం. ఈ ఐచ్ఛిక, అంతరంగిక సహకార విధానం ప్రతీ వ్యాపారస్థుని, ఉద్యోగి, పారిశ్రామికుని, పండితుని, ఇంజనీరు హృదయంలోను చోటు చేసుకొన్నది.

ఐచ్ఛికమైన ఈ ప్రయివేటు సంస్థల కార్య కలాపాలు మన సరిహద్దులను దాటి వ్యాపించి వున్నవి. అమెరికా ఆర్థిక వ్యవస్థ స్వరూపాన్నే అవి మార్చి వేసినవి. స్వతంత్ర ప్రపంచ రాజ్యాల ఆర్థిక వ్యవస్థను కూడా అవి మార్చివేయ గలవు.

ఒక్క మాటలో చెప్పాలంటే—ఈ అర్ధ శతాబ్దం లోను అభివృద్ధి చెందిన మన మిత్రరాజ్యాలలో వలెనే అమెరికా అనుభవం కూడా, ఒక శతాబ్దం క్రితం కారల్ మార్క్స ఏ సమస్యల మీద హెచ్చుగా ఆధారపడ్డాడో, అర్ధ శతాబ్దాత్పూర్వం మనలను ఏ సమస్యలు ఎదుర్కొన్నవో, 25 సంవత్స రాలుగా ఏ సమస్యలైతే ఇంకా అపరిష్కృతంగా వుండిపోయినవో, అట్టి సమస్యలను పరిష్కరించ గలిగిన ఒక నవసమాజాన్ని రూపొందించింది.

ఈ విధంగా ప్రభుత్వ చర్యల ద్వారా మనం

ఉద్దేశిస్తున్న కార్యక్రమానికి తోడు మనం మన ఆంతరంగిక సమస్యల పరిష్కారానికి అనుసరించిన పద్ధతులను ప్రపంచ విస్తృతంగా అనుసరింప జేయాలనే నేను ప్రతిపాదిస్తున్నాను. యునైటెడ్ స్టేట్స్‌లో అశేషంగా వున్న విభిన్నమైన – వేర్వేరు తరహాల ప్రయివేటు సంస్థల అనుభవ, విజ్ఞాన, సుహృద్భావాలను మన సరిహద్దులకు ఆవల వున్న వారికి కూడా అందుబాటు జేయగల ఒక ప్రయివేటు సంస్థ వుండాలి. ఈ సందర్భంలో యిదివరకే చాలా కృషి జరిగింది. ఇతర దేశాలనుంచి ప్రముఖులను ఆహ్వానించడానికి, యితర దేశాలకు పంపడానికి అనేక సంస్థలు సిద్ధపడ్డాయి. ఆర్థిక సహకార సంస్థ ఆధ్వర్యాన అమెరికాను దర్శించిన ఉత్పత్తి పరిశీలక సంఘాల ద్వారా యిటువంటి పథకాల ప్రయోజనం ఎంతగా వుండగలదో నిరూపించబడింది. ఇటువంటి పథకాలను ఇంకా పెక్కింటిని అమలు జరపవచ్చు.

ప్రయివేటు సంస్థల ద్వారా, వాటి సహకారం ద్వారా వ్యక్తమైనంతగా మరి దేనివల్ల యునైటెడ్ స్టేట్స్‌కు గల వాస్తవిక శక్తి వ్యక్తం కాలేదు. అందువల్లనే వీటి ద్వారా మనలో అంతర్గతమైన

భావనను, సహకారాన్ని ప్రపంచానికి లభ్యం చెయ్యాలని నేను కోరడం.

ప్రభుత్వ నాయకత్వం ద్వారా జరుగుతున్న కృషికి తోడు, ప్రయివేటు కార్యక్రమాల ద్వారా కూడా మనం తగిన చర్యలు తీసుకొన్నపుడు నవ జీవనోద్దీపితమైన భావసంపదను యితరులకు అంద జేసిన వారం కాగలం. అయితే యిది ఏకపక్షంగా మాత్రమే జరగరాదు. మన సోదరులనుంచి మనం ఎంతో నేర్చుకోవలసి వుంది. మనం యితరులనుంచి ఎల్లప్పుడు నేర్చుకొంటూనే వున్నాము. ఇతర ప్రజల నుంచి, ఇతర సంస్కృతులనుంచి మనం నేర్చుకొన్న వారసత్వ బలంనుంచే మన సమాజం అభివృద్ధి చెందింది. ఈ వారసత్వ సంపద అనేక సంవత్స రాలుగా మనకు లభిస్తూనే వుంది. మనం ఇంకా నేర్చుకొనగలం. ఇతరులతో మనం ఇంకా పంచు కొని తీరాలి కూడా.

స్వయం నిర్ణయాధికారాన్ని, పరస్పరంగా ఒక రిపై ఒకరు ఆధారపడడానికి సంబంధించిన మహ త్తర భావాలను కార్యరూపంలో పెట్టి, ప్రభుత్వ విధానాలలో నేమి, ప్రయివేటు విధానాలలో నేమి వాటిని వ్యక్తీకరించవచ్చు. మనం ఒకజాతిగా అవత రించడానికి ముందు పెక్కు శతాబ్దాలుగా పొందిన

అనుభవంతో, మనం నేర్చిన గుణపాఠాలను ఏ మేరకు మనం అంతర్జాతీయంగా అందజేయగలమో, ఆ మేరకు మనం మన నైతిక బాధ్యతలను నిరూపించినవారం కాగలం. కొత్త రాజకీయ వ్యూహాలకు కొత్త ఆయుధాలను సిద్ధం చేసుకొన్నవారం కాగలం కూడా.

# 4

ఈ అర్ధ శతాబ్దంలో జరిగిన ఒక సంఘటన ఏమంటే, అమెరికా ఆర్థిక వ్యవస్థ మారడం, మార్పుచెందే స్వభావం కలిగివుండడమూను.

ఆ మార్పు ఏమిటి ?

1900 సంవత్సరంలో అమెరికా ఆర్థిక వ్యవస్థ, 'ది బిగ్ ఛేంజి' అనే పుస్తకంలో ఫ్రెడరిక్ లూయిూ చెప్పినట్లు 'ప్లూటోక్రసీ'కి దగ్గరగా చేరుకొంది. దానినే ఈనాడు 'మ్యూచుయల్ కేపిటలిజం' (పరస్పర పెట్టుబడివిధానం)గా పాల్ జి. హోఫ్‌మన్ వర్ణించాడు. ప్రొఫెసర్ సమ్నర్ స్లిచర్ ఈ వ్యవస్థ 'పెట్టుబడిదారీ విధానానికి (కేపిటలిస్టిక్) సంబంధించినది కాదు—శ్రామిక (లేబరిస్టిక్) విధానానికి సంబంధించిన'దని అంటున్నాడు. దీనినే పీటర్ డ్రూకర్ 'ప్లూరలిస్టిక్' (బహుళ బాధ్యతాయుత

సంఘం) అంటున్నారు. అమెరికా ఆర్థిక వ్యవస్థ క్రమక్రమంగా సమన్వయం పొందుతున్నదని, దానిలో సాంఘికంగానేమి, ఆర్థికంగానేమి బాధ్యతాయుతమైన శక్తులు కలవని యిదివరలో కంటె యిప్పుడు హెచ్చుమందికి ఆర్థికంగా అవకాశాలు, ప్రయోజనాలు లభిస్తున్నవనీ – వీరు, ఆర్థిక శాస్త్రం అభ్యసించిన యితర విద్యార్థులూ చెప్పుతున్నారు. ఇదివరలోకంటే యిప్పుడు హెచ్చుమందికి మరింతగా అవకాశాలున్నాయి. ఆర్థిక శక్తి కేంద్రీకరణ చాలా తక్కువగా వుంది. భారీ వాణిజ్యవర్గాలవారి ప్రాబల్యం అంత హెచ్చుగాను, తగ్గుగాను లేకుండా పోయింది. కోటీశ్వరుల సంఖ్య తక్కువైంది. అనుభవం హెచ్చింది.

అమెరికా ఆర్థిక వ్యవస్థలో కలిగిన మార్పులు అమెరికనులకేగాక, ప్రపంచమంతటికీ కూడా ముఖ్యమైనవి. కేపిటలిజంపై మార్క్సిజం చేసే విమర్శ సహేతుకమైనది కాదని నిరూపించడంలోనే ఈ ప్రాధాన్యం యిమిడివుంది. మార్క్సు ఆలోచించిన, చూసిన సమస్యలేగాక ఇంకా అనేకం పరిష్కరించబడ్డాయి. ఒకవైపు గుత్తవ్యాపార సంస్థలు (కార్టెల్స్) మరొకవైపున కమ్యూనిజం. ఈ రెండింటికీ మధ్య సోష

లిజం. ఇవన్నీ బాధ్యతాయుత స్వేచ్ఛా వాణిజ్య చైతన్యానికి వర్తించవు.

అమెరికన్ ఆర్థికవ్యవస్థ సాధించినవి యీ క్రింద పేర్కొనబడుతున్నవి.

*1. విస్తారంగా ఉత్పత్తి: ప్రపంచం జనాభాలోను, భూమి విస్తీర్ణంలోను అమెరికా జనాభా, విస్తీర్ణం ఆరు వంతులు మాత్రమే అయినప్పటికీ, ప్రపంచంలోని వస్తు సామగ్రిలో నూటికి 40 నుంచి 50 వంతులవరకు ఉత్పత్తి చేస్తున్నది. 1850 నుంచి 1950 లోపుగా కార్మికశక్తి తొమ్మిదివంతుల కంటె కొంచెం తక్కువగా హెచ్చినప్పటికీ ఉత్పత్తి నూటికి 30 వంతులు పెరిగింది. ఇంతగా సాగిన ఉత్పత్తికి ఆధ్యాత్మిక బలంలేదని, పైగా ప్రమాద హేతువని పెక్కుమంది యూరోపియనులు, ఆసియనులు కూడా భావిస్తున్నారు. భౌతిక సంపదల ఉత్పత్తే తమకు ఏకైక పరమార్థమని భావించేవరకు వీరి భావం సరైనదే. కాని వాస్తవానికి ఎందరు ఇలా చేస్తారు? ఒక జత పాదరక్షలలో ఆధ్యాత్మికంగా న్యూనత కలిగిం

---

* ఈ వివరాలు అడ్వర్టయిజింగ్ కౌన్సిల్ 'అమెరికన్ రౌండ్ టేబిల్'కు చెందిన ట్వెంతియత్ సెంచరీ ఫండ్ వారి తరఫున ఇవాన్స్ క్లార్క్ అమెరికన్ ఆర్థిక వ్యవస్థపై సిద్ధం చేసిన నివేదికనుంచి సంగ్రహించబడినవి.

చేది ఏదీ లేదు. మానవుడు తన భౌతిక పరిసరాలను అదుపులో వుంచుకొని మెరుగు పరుచుకొనడంలో సాధించిన విజయాల విలువలను మనం ఆధ్యాత్మికంగా వినియోగించుకోవాలి. భౌతిక శక్తులను స్వాధీనం చేసుకొనడం ద్వారా పొందిన విలువలను ఆధ్యాత్మికోన్నతికి వీలుగా ఉపయోగించుకుంటూ ఈ అధికోత్పత్తి అంతా దైవదత్తమైనదనే గ్రహించాలి.

2. పని చేసే కాలపరిమితి:

1850 లో అమెరికాలో సగటున వారానికి పని చేసే గంటలు 70. ఈనాడు అవి 40 మాత్రమే. ఈ సందర్భంలో కొంత వివరణ అవసరం. కష్టపడి పని చెయ్యడంలో తప్పుకాని, పాపంకాని ఏమీ లేదు. అవాంఛనీయమైనది కూడా ఏదీ లేదు. కొత్తగా సంపాదించుకున్న విరామ కాలాన్ని ఏ విధంగా వినియోగించుకోవలసినది ఇంకా తగినంతగా నేర్చుకోలేదు. కాని వారానికి 70 గంటల పనివల్ల కలిగే భారాన్ని తగ్గించడం అవసరం. మానవుడు మరింత సుఖ సంతోష సంభరితమైన జీవితం గడపగల అవకాశాలు అవసరం. కాని పనికి, కష్టించి పని చెయ్యడానికి గల విలువను మనం విస్మరించరాదు. సవాలును ఎదుర్కొనడం ఆధ్యాత్మికంగా తప్పనిసరి అయి

నప్పటికీ, మరీ మితిమీరని శ్రమతో మానవుడు పై మెట్టును అందుకోగల స్థితిని సాధించాలి. కనకనే మనం ఆర్థికంగా మన సమాజాన్ని శక్తివంతమూ, విశ్రాంతి రహితమూ అయిన అసంతృప్తి స్థితిలోనే వుంచాలి.

3. ఉత్పాదక శక్తి : గంట గంటకు ఉత్పత్తి హెచ్చుదల :

ఉత్పత్తిని అధికంగా అదే పనిగా పెంచుకు పోవడానికి యిది భిన్నమైనది, ప్రధానమైనదీని. 1850 నుంచీ చూడగా ప్రతి మనిషి ప్రతీ గంటలోను చేసేపని ఆరింతలు పెరిగింది. గత మూడు నాలుగు సంవత్సరాలలోను యిది మరింత హెచ్చింది. ఆర్థిక శాస్త్రజ్ఞులు, కార్మిక నాయకులు కూడా 'పని వేగం,' 'కార్మికుల దైన్యం' అని పేర్కొంటూ వుంటారు. హెచ్చు ఉత్పత్తి సాధించాలంటే కార్మికులు మరింత ఐచ్ఛికంగా, ఉత్సాహంగా పని చెయ్యాలనీ, తమతో భాగస్వాములు కావడం అవసరమని యజమానులు యిప్పుడు గ్రహించారు. పని చెయ్యడానికి సంబంధించిన పరిస్థితులు సాంకేతికంగా మెరుగు పడినవి. పరిష్కారం కావలసిన సమస్యలు ఇంకా వున్నప్పటికీ 'పని భారం దుర్భరంగా వుంది' అనే మాట ఈనాడు తక్కువగా విని

పిస్తున్నది. కార్మికులు నిజ్ఞతతో తమ పనిని చక్కగా గ్రహించడానికి, శ్రద్ధాసక్తులు వహించడానికి యజమానులు తోడ్పడుతున్నారు. ఈ విధంగా ఉత్పత్తి, తద్వారా ప్రతిఫలం ఆరోజు కారోజు హెచ్చుతున్నాయి.

4. చరిత్రలో అపూర్వమైన పెట్టుబడులు :

మన మూలధనం పబ్లిక్, ప్రయివేటు రంగాలు రెండింటిలోను కూడా బ్రహ్మాండమైనదని చెప్ప వచ్చు. ఈ మూల ధనంతో మనం సాధించిన కార్యాలు అపారమైనవి. కాని ఈ కార్యాలకు ఎంతెంత ద్రవ్యం ఖర్చయినదీ, ఉత్పత్తులు, భారీ యంత్రాలు ఎంతవరకు వినియోగించబడి, ఎట్టి ఫలితాలనిస్తున్నదీ మనకు ప్రత్యక్షంగా కనిపించవు.

ఉదాహరణకు : మన రహదారులు అమెరికా లోని పరిశ్రమల ఉత్పాదక శక్తిని ఎంతగా హెచ్చించి నవి ? బోస్టన్ చుట్టూ కొత్తగా వేస్తున్న రహదారి వల్ల అట్లాంటిక్ కోస్తాకు ఎగువను, దిగువను వున్న పరిశ్రమల విలువ ఆర్థికంగా ఎంత పెరుగుతూ వుంది? ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలోను, ఆ తర్వాత కూడా మన భారీ యంత్రాల పరిశ్రమను, పెట్టు బడులను విపరీతంగా పెంచుకొంటూ వచ్చాము. 1958 లో 28 బిలియనుల విలువ మేరకు, 1951 లో

30 బిలియనుల డాలర్ల విలువ మేరకు నిర్మాణాలు సాగించాము. ఈ విధంగా కొత్తగా చేసుకొంటూ పోతున్న నిర్మాణాల మూలంగానే మన ఆర్థిక వ్యవస్థ అగ్రగామిగా వుంటున్నది.

5. ప్రపంచం మొత్తం మీద హెచ్చు మందికి హెచ్చు ఆదాయాలు :

డబ్బు అనేది సులభంగా అపోహ కలిగించే కొలబద్ద. బానిసత్వం నుంచి మానవుడు ఎంతవరకు పైకి వచ్చినదీ అది చెబుతుంది. కొంతవరకు సాంఘిక న్యాయానికి అది ప్రాతినిధ్యం వహిస్తుంది. మానవుడు తన అవసరాలను తగినంతగా తీర్చుకొనడానికి, దుర్బలులకు, నిస్సహాయులకు తోడ్పడడానికి, పూర్ణ జీవితాలను గడపడానికి తగిన శక్తిని అది సమకూర్చింది.

నిజమైన విలువలు సోవియట్ యూనియన్‌లో కంటె అమెరికాలో పదిరెట్లు హెచ్చుగా వున్నవి. 1840 లో యునైటెడ్ స్టేట్స్‌లో వ్యవసాయేతర వృత్తులలోని వారి వేతనం గంటకు ఎనిమిది సెంట్లు. ఈనాడు ఫ్యాక్టరీలలో వేతనం గంటకు 1.64 డాలర్లు. అంటే ఇరవై రెట్లు అధికమన్నమాట. జీవన వ్యయంలో పెరుగుదలను మినహాయించి చూసి నప్పటికీ వేతనాలకు సంబంధించిన వాస్తవికమైన

కొనుగోలు శక్తి 1840 లో కంటె ఈనాడు నాలుగైదింతలు ఎక్కువగా వుంది. తన కుటుంబావసరాలను తీర్చుకొనడానికి ఒక వ్యక్తి 1914 లో పరిస్థితిలో పోల్చి చూసినపుడు ఈనాడు ఎన్ని గంటలు పని చెయ్యవలసి వుంటుందో ఈ క్రింది పట్టిక సూచించగలదు.

* శ్రమపడవలసిన అవసరం తగ్గుదల

| | వారంలో పని గంటలు | |
|---|---|---|
| | 1914 | 1948 |
| | (అసలు) | (అసలు) |
| ఆహారం | 29.4 | 12.4 |
| వస్త్రాలు | 9.3 | 4.7 |
| గృహాలంకరణకు | 1.8 | 1.6 |
| వ్యక్తిగతావసరాలు | 0.8 | 0.6 |
| వైద్యం, మందులు | 3.6 | 1.0 |
| రవాణా సౌకర్యాలు | 1.6 | 2.2 |
| వంట చెరకు, దీపం | 3.6 | 1.9 |
| వినోదాలు | 4.5 | 1.4 |
| ఇంటి పనులు | 1.9 | 1.1 |

* ఫ్రెడరిక్ మార్టిన్ స్టైర్న్ రచించిన కేపిటలిజం ఇన్ అమెరికా (న్యూయార్క్ – రైన్ హార్ట్ అండ్ కో ఇన్ కార్పొరేటెడ్ 1951) నుంచి.

| | | |
|---|---|---|
| అద్దె | 8.2 | 4.2 |
| రాబడి పన్ను | — | 1.2 |
| చిల్లర మల్లర | — | 1.3 |
| | 64.7 | 33.6 |
| మొత్తం సంపాదన | 51.5 | 39.7 |

యునైటెడ్ స్టేట్స్‌లో పేదరికం పూర్తిగా తొలగిపోలేదు. కాని క్రమంగా తగ్గిపోతున్నది. జనాభాలో మూడవవంతున్న కటిక పేద అమెరికన్ కుటుంబాలు, ఒంటరిగా జీవించే వ్యక్తుల రాబడి 1935-36 లో 470 డాలర్లు. 1950 నాటి ధరల దృష్ట్యా చెప్పవలసివస్తే 820 డాలర్లు.

కలవారుగా వున్న మిగిలిన మూడింట రెండు వంతులమంది ఆదాయం 780 డాలర్లు. 1950 ధరల దృష్ట్యా చెప్పవలసివస్తే 1360 డాలర్లు. 1950 లో పేదవర్గం సగటురాబడి 1250 డాలర్లకు, పైవర్గాల ఆదాయం 2100 డాలర్లకు పెరిగింది. అంటే జాతీయాదాయంలో ధనికవర్గాలకు చెందిన వాటా పూర్తిగా తగ్గిపోయిందన్నమాట. 1929 జనాభాలో మూరింట ఒక వంతుగానే వుంటూ వచ్చిన అధికాదాయ వర్గంవారికి జాతీయాదాయంలో నూటికి 19

వంతులు చెందగా, 1946 లో అది పొందిన వాటా మూటికి ఎనిమిదివంతులు మాత్రమే.

# 5

క్రిందటి అధ్యాయంలో క్లుప్తీకరించబడిన ప్రతీ భౌతికాభివృద్ధి చిహ్నంలోను ఆధ్యాత్మికోన్నతి కూడా గర్భితమై వుంది. ఆ చిహ్నాలు మానవుని ఎంతవరకు స్వేచ్ఛాజీవిగా చెయ్యగలిగినవన్న అంశం దృష్ట్యానే వాటి ప్రాధాన్యాన్ని మనం నిర్ణయించుకో వలసి వున్నాం. స్పష్టంగా చెప్పాలంటే యునైటెడ్ స్టేట్స్ యిప్పటికీ మార్పులు చెందుతున్న యుగ సంధిలో వున్నది. సమాజంలో మానవునకు అత్యు న్నతమైన విలువను సాధించగల అవకాశాలు మనకు ఎక్కువగా వున్నాయి. ఈ విలువలలో కొన్ని టిని మనం యిదివరకే సాధించుకొనడానికి ప్రయ త్నించాం. మొత్తంమీద చెప్పాలంటే ఆ ఆర్థిక విజ యాల వాస్తవిక ప్రాధాన్యాన్ని ప్రపంచం అపార్థం చేసుకొంది. కొందరికి ఈ విజయాలు, ఫలితాలు అపార్థం కలిగించాయి. కొందరు వాటిని ఈసడించు కొంటున్నారు.

అమెరికనులు మాత్రం తమ భావాలలోను, చర్యలలోను కూడా మైడాస్ పొందిన దుర్దశను

దాతృత్వం ద్వారా కాక క్రైస్తవ నీతులలో ఉత్త మంగా వ్యక్తీకరించబడిన సత్యాన్ని గ్రహించు కొనడం ద్వారాను, భౌతిక వాదాన్ని తగిన స్థానంలో వుంచడం ద్వారాను తప్పించుకొనగలరు. తన ఆత్మనే కోల్పోయిన మానవునకు ప్రపంచం అంతా తన ఆధీనమైనా కలిగే లాభం ఏమిటి?

మనం పొందిన లాభాలకు కారణాలివి :

1. భౌతికంగా అమెరికా విడిగా వుండడమే. ముడి యినుము, పెట్రోలువంటి పరిమిత సహజ సంపద లను మనం వ్యయపరచినప్పటికీ యుద్ధఫలితమైన విధ్వంసన ప్రమాదం తప్పింది. మన దేశం ఇలా విడిగా వుండడంకంటెకూడా దాని విస్తీర్ణం, దాని సహజ సంపదలు మనకు మరింత అమూల్యమైనవి. యునైటెడ్ స్టేట్స్‌లో సుంకాల బెడదలేని ప్రాంతం విశేషంగా వున్నందున, అమితంగా ఉత్పత్తికి, అపరి మితమైన మార్కెట్టుకు అవకాశాలు లభించాయి. ప్రకృతి సిద్ధంగా మనకు గల భూములు, అడవులు, ఖనిజాలు, పెట్రోలియం, బొగ్గు, ఇనుము, జల సౌక ర్యాలు—ఇవి యితర దేశాలకు లేని అనేకావకాశా లను మనకు లభ్యంచేశాయి.

2. అంగబలం :

మన సహజ సంపదలకు సమానమైనదే మన

అంగబలం కూడా. మన ప్రజలు విశ్రాంతి నెరుగని ఉత్సాహ చైతన్యవంతులై వుండడం, విభిన్న వర్గాల వారై వుండడం, నిరవధికంగా వుండడం మన అదృష్టం. ఈ జనం ఒక మహా ప్రవాహంవంటిది. ఒక్కొక్కప్పుడు ఈ ప్రవాహాన్ని మనలో లీనం చేసుకోవడం కష్టసాధ్యమౌతూ వుండేది. ప్రవాహంలో వచ్చిపడుతున్న కొందరు దుర్బలులై వున్నట్లున్నా కనిపించేది. మొత్తంమీద అనేక శతాబ్దాలుగా వలస వచ్చిపడిన ప్రజలమూలంగా బ్రిటన్‌కు ఎంత మేలుకలిగిందో, అదేవిధంగా యునైటెడ్ స్టేట్స్‌కూడా వైవిధ్యంకల జనాభా మూలంగా లాభం పొందింది.

3. ప్రజల స్వభావము, వ్యవస్థ:

ఏ. ఆధ్యాత్మికమైన పునాది. అమెరికా సాధించిన విజయాలకు, దాని రిపబ్లిక్‌కు పునాదిగావున్న ఆధ్యాత్మిక సంపదను మించిన మరొక సంపద ఏదీ లేదు. రిపబ్లిక్ స్థాపించిన పెద్దలు "మానవునకు భగవంతుడు తిరుగులేని హక్కులను కొన్నింటిని దత్తం చేశాడు. అది జీవితం, స్వేచ్ఛ, ఆనందానుభూతిపట్ల అభిలాష అనేవి" అని వ్రాశారు. ఈ వాక్యాలను వ్రాసిన వ్యక్తులు ఆ నాటికే కాదు, సర్వకాలాల్లోను కూడా ప్రతిభావంతులైన రాజకీయ

వేత్తలుగా కీర్తి పొందుతున్నారు. 18 వ శతాబ్దపు రాజకీయ భావుకుల గ్రంథాలను వారు చదివి అవగాహన చేసుకొన్నారు. చివరకు వారినే అధిగమించగలిగారు. భగవంతునకు మానవుడు ఋణపడి వున్నాడన్న గుర్తింపు ప్రాతిపదికగానే వారు రిపబ్లిక్‌ను స్థాపించుకొన్నారు. ఈవిధంగా దానికి వారు ఆధ్యాత్మికమైన పునాదులను బలపరిచారు.

బి. వర్గరహిత సమాజం : అలా వారు నెలకొల్పిన సమాజం క్రమక్రమంగా వర్గరహిత సమాజంగా రూపొందింది. వెంటనే కానప్పటికీ అవకాశం కలిగించడమనే అర్థంలో మానవుల సమానత్వం గుర్తించబడింది. ఆర్థిక వ్యవస్థ క్రమేపీ వికాసం పొందడంతో అసమత్వాలు తగ్గసాగాయి. అవకాశాలు హెచ్చసాగాయి. సాంఘికమైన ఈర్ష్యలు సన్నగిలాయి. నెమ్మదిగానే అయినప్పటికీ జాతి సంబంధములైన అసమత్వాలను వైమనస్యాలను అధిగమించ గలుగుతున్నాం. మనకు ఇంకా తీవ్రమైన జాతీయ సమస్యలు కలవనడంలోగాక, వాటిలో ప్రతిదానిని పరిష్కరించుకో గలిగామన్న దానిలోనే ప్రాధాన్యం వుంది. అయినప్పటికీ సమానత్వం కాకపోయినప్పటికీ మనం న్యాయం కోసం ఒత్తిడి పెడుతూనే వుండాలి.

సి. సహకార భావం : ఒక జట్టుగా కలిసి పని చెయ్యాలని, భారాన్ని తలో కాస్త పంచుకోవాలనే భావం అమూల్యమైనది. సమాజంలో ఇదొకభాగం. ఐచ్ఛికంగా ఏర్పడిన మన ప్రయివేటు సంస్థల ద్వారా యిది సుస్పష్టమాతున్నది. ఒక యంత్రాన్ని నడుపుతున్న జట్టులోగాని, ఒక పరిశోధనాలయంలో పని చేస్తున్న శాస్త్రజ్ఞులలో గాని, మరెక్కడైనా కాని యిది మనకు కానరాగలదు. మన జాతి స్వయం శక్తిపై ఆధారపడిన వ్యక్తులతో రూపొందినదే కావచ్చు. సహకారేచ్ఛ, సమైక్యత మనలో కొరవడి వుండలేదు. మనం కలుపుగోలుతనం కలవాళ్ళం. ఇది చాలా ఉపయోగం.

డి. ఉత్పాదక శక్తిలో సాంఘిక, నైతిక విలువలు: ఉత్పాదకశక్తి ప్రాధాన్యాన్ని కేవలం 'సరకుల'రూపంలోగాక, పని చెయ్యడంలో సంతృప్తి, పనికి పూర్తి భద్రత, వాంఛనీయ అవసరాలను తీర్చగల స్తోమత, ఉన్నతమైన సాంఘిక విలువల స్థాయిలో కూడా గుర్తించాలి. ఈ [illegible]సంస్థల మన ప్రధాన ప్రాతిపదికే అది సాధిస్తున్న ఫలితాలను [illegible] వివరిస్తుంది.

ఇ. సాంఘిక బాధ్యతల ఆమోదం : అమెరికన్ వ్యవస్థలో నానాటికి హెచ్చుతున్న సాంఘిక

బాధ్యతల ప్రాధాన్యాన్ని యజమానులు, నిర్వాహకులు, శ్రామికులు గుర్తించడ మనేది ఘనమైన సంగతిగా పేర్కొనవచ్చు. తొమ్మిదవ అధ్యాయంలో ఈ విషయం సమగ్రంగా వివరించ బడింది. వర్తక వాణిజ్య వేత్తలు తాము బాధ్యత వహించి పనిచేస్తున్న వాటాదార్లకు మాత్రమే కాకుండా, తమ కార్మిక వర్గాలకు, వాడకం దార్లకు, మొత్తం మీద సమాజానికి తాము సమకూర్చవలసిన ప్రయోజనాలు కొన్ని కలవనే విషయాన్ని ఎక్కువగా గుర్తిస్తున్నారు.

ఎఫ్. విస్తృత పరిశోధనలు : అమెరికన్ ఆర్థిక వ్యవస్థ అభివృద్ధికి పరిశోధనల వల్ల కలిగినంత సహాయం మరి దేనివల్లను కలగలేదు. ఈనాడు పరిశోధనల క్రింద సాలుకు కనీసంలో మూడు బిలియన్ల డాలర్లు ఖర్చు చెయ్యబడు తున్నాయి. ఇందులో నూటికి 80 వంతుల వ్యయాన్ని పెద్ద కార్పొరేషనులు భరిస్తున్నాయి. ఇరవై సంవత్సరాలకు పూర్వం దీనిలో యాభయ్యో వంతుకూడా ఖర్చు పెట్టబడలేదు. పెద్ద కార్పొరేషనులు దీనికి పూనుకోనప్పుడు ప్రభుత్వమే ఈ పనిని - దాని పరిణామాలతో సహా నిర్వర్తించవలసి వచ్చేది. ప్రస్తుతం కొనసాగుతున్న పరిశోధనలలో ప్రభు

త్వానికి కూడా తగిన పాలువున్న మాట నిజం. అయితే పెద్ద కార్పొరేషనులే ఎక్కువగా భారం వహిస్తున్నవి. దీనివల్ల మొత్తం ప్రపంచం లబ్ధి పొందుతూ వుంది. క్షీణించిపోతున్న సహజ సంపద లకు కూడా సమాధానం దీనిలోనే వుంది. పెద్ద సంస్థలు పరిశోధనల ఫలితాలను చిన్న సంస్థలు ప్రయోగంలో పెడుతున్నవి. విశ్వవిద్యాలయాల లేబరేటరీలలో పరిశోధనలు సాగిస్తూ వచ్చిన కొందరు పరిశోధకులు సరాసరిగా లాభసాటి అయిన పరిశోధన రంగంలో ప్రవేశిస్తున్నారు కూడా.

జి. భోగట్టా అందుబాటు : గత పాతిక సంవత్స రాలలోను వాణిజ్య వర్గాలు తమ అనుభవాన్ని పంచుకోనడానికి సిద్ధపడాలనే యిచ్ఛ, ఐచ్ఛిక సంస్థల ద్వారా, సామరస్య, సహకార పూర్వక వాతావరణం ద్వారానే సాధ్యపడ్డది. అలాగే పరి శోధనల యుగం పంపిణీల యుగంగా మారింది. ఈ విధంగా పరస్పర సహాయం అందరకు లాభదాయకం కాగలదనే గుర్తింపు సర్వే సర్వత్ర కానవచ్చింది. పేటెంటుల సమీకరణాల వల్ల సహాయం జరిగింది. తద్రక్షణవల్ల వ్యాపార రహస్యమనేది అనవసరమై పోయింది.

హెచ్. సాంఘిక సూత్రాల అవగాహన: ఒక శతాబ్దం వెంబడి మరొక శతాబ్దంలో మానవ శక్తి వినియోగంలో క్రమాను గతమైన అభివృద్ధి కానవచ్చింది. ఫ్యాక్టరీల నిర్వహణలో ప్రజలు ఎలా కలిసి మెలిసి వ్యవహరిస్తున్నారో, ఏవిధంగా వారు కలిసి మెలిసి జీవిస్తున్నారో హార్వర్డ్ వ్యాపార కళాశాలకు చెందిన కీర్తిశేషులైన ప్రొఫెసర్ ఈటన్ మేయో వంటివారు పెక్కుమంది పరిశోధించారు. కార్మికుల విషయంలో అనుకూలమైన అవగాహన, సానుభూతి అవసరమనేది స్పష్టంగా ఆమోదించబడింది.

4. పోటీ:

అమెరికన్ వ్యవస్థ పటిష్ఠతకు పరస్పరం పోటీ అనేది ఎంత ఎక్కువగా తోడ్పడినదో దానిపై ఎన్ని గ్రంథాలైనా వ్రాయవచ్చు. పాత ధోరణిలోనే సాగుతున్న ధరల మధ్య పోటీని గమనిస్తూ వచ్చిన వారికి భారీ వాణిజ్యాభివృద్ధి ఆందోళన కలిగించింది. దీనికి సంబంధించిన పెక్కు విషయాలను డేవిడ్. ఇ. లిలియన్ థాల్ తన 'బిగ్ బిజినెస్, ఏ న్యూ ఈరా' అనే పుస్తకంలో వ్రాశాడు. రకరకాల పోటీల వల్ల అమెరికన్ వ్యవస్థ ఎంత పటిష్ఠంగా వుంటున్నదో దానిని ప్రొఫెసర్ జి. కె. గాల్

బ్రెయిత్ తన 'అమెరికన్ కేపిటలిజం, ది కాన్సెప్ట్ ఆఫ్ కౌంటర్ వెయిలింగ్ పవర్' అనే గ్రంథంలో వివరించాడు. బ్రూకింగ్స్ ఇన్‌స్టిట్యూషన్ వారు "బిజినెస్ ఇన్ ఏ కాంపిటీటివ్ సొసైటీ" అనే విషయంపై బ్రహ్మాండమైన పరిశోధన జరిపించారు. ఆ పరిశోధన సారాంశాన్ని 1953 ఫిబ్రవరిలో 'ఫార్ట్యూన్' అనే పత్రిక ప్రకటించింది. ఈ 14 పేజీల నివేదికలోను భారీ వ్యాపార మనేది గుత్తాధికారంతో సమానం కాదని స్పష్టీకరించ బడింది. సాంకేతికాభివృద్ధి పోటీకి ఎంతగా దోహద మిచ్చినదీ సూచించబడింది. ఈ విధంగా భారీ వాణిజ్యం, వ్యాపారంలో పోటీలను గురించి సాగిన పరిశోధనలు కొత్త తరహా ప్రభుత్వ విధానాలు-ట్రస్టుల వ్యతిరేక శాసనం వాటి సవరణకు, పెద్ద వాణిజ్య సంస్థలు అవి పెద్దవి కనక విచ్ఛిన్నం చెయ్యాలనే ధోరణి మార్పు చెందడానికి దారి తీయ వచ్చు. ఏమైనప్పటికీ ఆర్థిక వ్యవస్థలో పోటీ పూర్వం-యిప్పుడూ ఒకే విధంగా వుంది. అది లేకపోతే ఆ వ్యవస్థే మొత్తంగా విచ్ఛిన్నమై పోగలదేమో!

# 6

అమెరికాలో సాధించబడిన ఈ ఫలితా లన్నిటికీ అనేక కారణా లున్నాయి. వాటిలో సాంకేతిక

పరిణామాలు ముఖ్యమైనవి. వాటిలో యంత్ర శక్తిని (మెకానికల్ పవర్) ఆకట్టుకోనడం వల్ల కూడా ముఖ్యమైన ప్రయోజనాలు కలిగాయి. ప్రకృతికి మానవునకు మధ్య ఏర్పడిన కొత్త సంబంధాలను నిరూపించడానికి యింతకు మించిన దేదీ లేదు.

ఏ. పవర్ మెషిన్లు:

సరకుల ఉత్పత్తికేమి, కార్మికుల ఉత్పాదక శక్తి హెచ్చడానికేమి అమెరికనులు యంత్ర శక్తిని ఎంతగా వినియోగించారో తెలుసుకొంటే మనకు విషయం చాల మట్టుకు సుబోధక మాతుంది. 1850 లో అమెరికన్ ఉత్పత్తిలో వినియోగించబడిన శక్తిలో నూరింట 74 వంతులు జన బలం, పశు బలాల వల్ల సమకూడినదే. 1950 నాటికి అది నూటికి ఏడు వంతులు మాత్రమే. చెయ్యవలసిన పనిలో నూటికి 93 వంతులు యంత్రాలే చేస్తున్నవి.

ఈ విధంగా యంత్ర శక్తిని బట్టి అవసరాలు పెరగడం, దానిని మనం వినియోగించుకొంటున్న తీరు, చివరకు ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలో కూడా నిపుణులకు ఆశ్చర్యం కలిగించింది. 1933 లో వెండెల్ ఎల్. విల్కి ఒక ప్రకటన చేస్తూ నారిస్ ఆనకట్ట ద్వారా ఉత్పత్తి కాగల విద్యుచ్ఛక్తి విని

యోగావసరమే లేకుండా పోగలదని వారించాడు. కాని ఈనాటి పరిస్థితి చూస్తే ఆ ఆనకట్ట ప్రాంతంలో నానాటికి పెరుగుతున్న అవసరాలను తీర్చడానికి సాలీనా ఏడు నారిస్ ఆనకట్టలకు సమానం కాగల విద్యుచ్ఛక్తి ఉత్పాదన అవసర మౌతూవుంది.

అలా అని మనం యంత్ర శక్తిని కేవలం పెద్ద పనులకు మాత్రమే ఉపయోగించడం లేదు. 1950 లో బంగళాల ముందు వుండే పచ్చికను (లాన్స్) కోయడానికి, కోడి గ్రుడ్లను పగలగొట్ట డానికి, చివరకు మీసాలు కత్తిరించుకోడానికి, అంద చందాలను పెంచుకోడానికి, అనేకమైన గృహ కృత్యాలకు, పరిశ్రమలకు, వినోద విలాస కార్య క్రమాలకు 2,80,00,000 చిన్న ఇంజనులను, కొద్ది పాటి ఎలెక్ట్రిక్ మోటార్లను, 2,50,00,000 అశ్వక శక్తి ఉత్పత్తి చెయ్యగల వాటిని మనం నిర్మించు కొన్నాము.

1951,'52,'53 లలో మనం ఇంకా ఎక్కువగా తయారు చేసుకొని వుంటాము. మనం ఉత్పత్తి చేసుకొంటున్న విద్యుచ్ఛక్తి కొన్ని బడుగు దేశాల లోని మొత్తం విద్యుచ్ఛక్తిని మించి వుండవచ్చు. మార్కెట్‌లో పళ్లు తోముకొనే ఎలెక్ట్రిక్ బ్రష్‌లు 11 రకాలు వున్నాయి. బహుశా అణుశక్తి లేదా

సూర్యరశ్మి శక్తి కూడా అందుబాటులో వున్నందున మనం యంత్ర యుగంలో అత్యున్నత శిఖరాగ్రాలను అందుకొన గలం.

బి. కార్య నిర్వహణలో విశిష్టత :

ఈ విషయాన్ని గురించి కూడా మనం ఎంతైనా చర్చించుకోవచ్చు. ఒక తరహా ఏర్పాటునుంచి మరొక తరహా పని కూడా చేసుకోవచ్చుననే సూత్రాన్ని కనిపెట్టడంతో అధికోత్పత్తి సాధనకు విపరీతమైన అవకాశం లభించింది. ఇంతవరకు అన్ని రకాల వస్తువుల తయారీ ఒక 'సంప్రదాయా'నికి అనుగుణంగా జరుగుతూ వుంది. ఒక రకం ఏర్పాటుతో మరొక రకం పని కూడా చేసుకోవచ్చుననే సూత్రం ఈ సంప్రదాయాన్ని విచ్ఛిన్నం చేసి కొత్త అభివృద్ధి మార్గాలకు అవకాశ మిచ్చింది. దానితో భారీగా ఉత్పత్తికి, పంపిణీకి అవకాశం లభించింది. ఇది చాల దేమో అన్నట్లు ఈ నాటి పరిశోధనలు, పరిశోధన లలో హెచ్చు భాగం 'వస్తువు'ను గురించి గాక, 'వస్తూత్పత్తి మార్గా'న్ని (ప్రాసెస్) కనుగొనడానికే కేంద్రీకరించ బడుతున్నాయి. ఇలాగ ఈ 'ప్రాసెస్' అనేది ఒక రకం ఉత్పత్తి ఏర్పాట్ల నుంచి మరొక రకం ఉత్పత్తుల సాధనకు అనువర్తించబడుతూ వుంది. ఇటువంటిది కొత్త విషయాలను కనిపెట్టడంలో

కాక, శాస్త్రీయ విజ్ఞానానికి సంబంధించిన మూల సూత్రాల పరిశోధన - ప్రయోగాలనుంచే సాధ్య పడింది. వీటివల్ల ఉత్పాదక శక్తి హెచ్చింది. చిన్న పరిశ్రమలు బలపడినవి.

పెన్సిల్వేనియా గ్రామీణ ప్రాంతంలో ఈ మధ్యనే నేను ఒక చక్కని కొత్త ఫ్యాక్టరీని దర్శించాను. ఆ ఫ్యాక్టరీ నిర్మాణానికి కొన్ని లక్షల డాలర్లు పెట్టుబడి పెట్టారు. రేయన్ వస్త్రాల ఉత్పత్తికి నిర్దేశించబడిన ఫ్యాక్టరీ అది. దాని నిర్మాణం పూర్తి అయ్యే నాటికి ఆ రేయన్ వస్త్రాల గిరాకీ తగ్గిపోయింది. ఈ ఫ్యాక్టరీ కేవలం 'ప్రాసెస్' పద్ధతిమీదగాక, కేవలం 'వస్తూత్పత్తి'పై నేఆధారపడివున్నట్లయి తేమొత్తంగా నష్టం వచ్చివుండేది. కాని ప్రాసెస్పైనే దాని నిర్మాణం ఆధారపడి వుండడంతో రేయన్ వస్త్రాలకు బదులు మరొకరకం కృత్రిమ వస్త్రాల తయారీకి అది మార్చబడింది. ఆ మార్పు సంపూర్ణ విజయం పొందింది. 'ప్రాసెస్'కు (వస్తూత్పత్తి విధానానికి) గల ప్రాధాన్యాన్ని ఈనాడు పూర్తిగా గుర్తించి వున్నందుననే ఆ ఫ్యాక్టరీ అంత చక్కగా పనిచేస్తూ వుంది.

ఈ పద్ధతిని అభివృద్ధి చెయ్యడంవల్ల కార్మికులకు కూడా సదుపాయం కలుగుతుంది. ఒక పరిశ్రమ

నుంచి మరొక పరిశ్రమకు సులభంగా మార్పు చెందడం కూడా సాధ్యపడుతుంది. పూర్తిగా యంత్రాల ద్వారానే పనిచేసే ఫ్యాక్టరీ, 'యంత్రాల ద్వారానే పనిచేసే మేధస్సు' (మెకానైజ్డ్ బ్రెయిన్) అప్పుడే మనకు వున్నవి. అయితే యిది వరకే చెప్పినట్లు మానవులమధ్య సంబంధాలను సుహృద్భావంతో, సుపరిచితం చేసుకోవడాన్ని పరిశ్రమలలో వచ్చిన మరొక కొత్త విప్లవంగా, కొత్త విధానం (ప్రాసెస్)గా పేర్కొనవచ్చు. సాంఘిక నిర్మాణ రంగంలో మనం యిటుపైన కనుగొన్న విశేషాలు పరమాణు గర్భంలో గాని, సూర్యమండలంలోగాని కనుగొనగల వాటికంటె కూడా అపూర్వమై వెలయగలవు.

కార్మికుల వైఖరి :

కార్మికుల పరిస్థితి క్రమక్రమంగా బలపడడానికి కూడా మూలకారణాలు కొన్ని వున్నాయి. అమెరికన్ కార్మిక వర్గాలలోని స్త్రీ పురుషుల అభ్యుదయ దృక్పథం, పనిపాటులలోని నేర్పు, సమయానికి అందుబాటులో వుండడం—ఇవే అమెరికా ఆర్థిక రంగంలో సాధించిన అనన్య విజయాలకు గల కారణాలలో కొన్ని అని చెప్పుకోవచ్చు.

అమెరికన్ కార్మికులు ఎల్లప్పుడూ మన వ్యవ

ష్ఠను విశేషంగా ఆమోదిస్తూనే వచ్చారన్న సంగతిని మనం ఓం ప్రథమంగా చెప్పుకోవాలి. ఎక్కడో మరీ అరుదుగా తప్పితే 'కేపిటలిజాన్ని' కూలద్రోయాలనే తలంపు కార్మికులకు లేదు. కేపిటలిజం ఫలితాన్నే వారు మరింతగా కోరుతున్నారు.'మా కింకా హెచ్చుగా ముట్టాలి' అన్నదే కార్మికుల అభిమతమని శామ్యూల్ గోంపర్స్ అనే ఆయన స్పష్టంగా పేర్కొన్నాడు.

పనిచేస్తున్న వారిలో ఎక్కువమంది తాము కూడా 'కేపిటలిస్టులం' కావాలనే కోరుకొంటున్నారు. నేటి కేపిటలిస్టులలో పెక్కుమంది తమ జీవితాలను కార్మికులుగా ప్రారంభించినవారే. యూరోప్‌లోని కార్మిక సంఘాలలో కంటె అమెరికన్ కార్మిక సంఘాలకు రాజకీయాలపట్ల అంత ఆసక్తిలేదు. రాజకీయరంగంలో అంత ఎక్కువ పలుకుబడి ప్రాబల్యాలున్నూ వారికి లేవు. వర్గ సంబంధమైన ఆవేశ కావేషాలు కూడా వీరిలో తక్కువే. ఉత్పత్తికి, తాత్కాలిక నియామకాలకు మాత్రమే వీరు హెచ్చు ప్రాధాన్యమిస్తున్నారు. ఈ సమస్యలు యిదివరలో వున్నాయి. ఇప్పుడూ వున్నాయి. ఇంకా అపరిష్కృతంగా వుండిపోయిన సంఘర్షణల ప్రాతిపదికలు కూడా కొన్ని వున్నాయి.

అయినప్పటికీ కార్మికుల యూనియన్లు ఉత్పత్తి పట్లనే ఎక్కువగా శ్రద్ధాసక్తులను ప్రదర్శిస్తున్నాయి. సహకరించడానికి ఎక్కువగా సిద్ధపడుతున్నాయి. కార్మికులను భాగస్వాములుగా చేసుకోవలసిన అవశ్యకతను యజమానులు సానుభూతి సద్భావాలతో అవగాహనం చేసుకుంటున్నారు.

హెచ్చు వేతనాలకోసం కార్మికులు 'పట్టుదల' వహించడంవల్ల యజమానులు, పరిశ్రమలు దెబ్బ తిన్న సందర్భాలు కూడా వున్నాయి. యునైటెడ్ మైన్ వర్కర్స్ (గనుల కార్మికులు) ప్రతినిధి జాన్ ఎల్. లూయీస్ గనుల కార్మికులకు హెచ్చు వేతనాలు రాబట్టడంలో చూపిన పట్టుదలను కొంత సడలించివుంటే బొగ్గుగనుల మనుగడ మరింత సుకరమై వుండేది. పశ్చిమ వర్జీనియాలోగాని, పెన్సిల్వేనియాలోగాని బొగ్గుగని కార్మికులకు ఇంకా ఎక్కువగా ఉద్యోగాలు దొరికి వుండేవి.

1930 నుంచి కార్మికుల యూనియన్లలో సభ్యులసంఖ్య తగ్గుతూ వస్తున్నది. యూనియన్ల విస్తరణలో మనం సమతలాన్ని చేరుకొన్నట్లు తోస్తున్నది. వ్యాపారం తగుమాత్రం సుస్థిరతను పొందివుంటే మనం అక్కడ నిలబడిపోవచ్చు. సభ్యుల సంఖ్యను పెంచడం ద్వారా యూనియనున్న బల

పరచాలనుకుంటే అనేక సమస్యలు ఏర్పడతాయి. కార్మికులు క్రమక్రమంగా వృత్తి దారులుగా (ప్రొఫెషనల్స్) మారిపోతున్నారు. ఇది కార్మికుల యూనియన్లను బలపరచగలదా లేదా? కార్మికులకు హెచ్చు వేతనాలను సాధించడానికి బాధ్యత కేవలం యూనియన్లదే కాదని, యూనియన్లుగా ఏర్పడని కార్మికులు గత ఇరవై సంవత్సరాలలోను యూనియనుల కంటె ఎక్కువ వేతనాలను సంపాదించుకో గలిగారనీ చారిత్రిక పరిశోధనలు సూచిస్తున్నవి. యూనియన్ల ఒత్తిడి ప్రభావం యూనియన్లకు చెందనివారి వేతనాలమీద ప్రసరించి వుండవచ్చుననే మాటను నేను విస్మరించడం లేదు. అయినప్పటికీ యథార్థం మారబోదు. ద్రవ్యోల్బణంవల్ల ద్రవ్యరూపంలో పొందే వేతనాలు పెరుగుతాయి. వస్తువులకు కూడా అధికమైన ధరలు పలుకుతాయి.

యునైటెడ్ స్టేట్స్‌లోని వేతనాల రేఖ (గ్రాఫ్)ను చూసినపుడు అంతర్యుద్ధపు రోజులలోనేమి, ప్రథమ ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలోనేమి దాని గమనం ఒకే తీరుగా వుంది. అయితే దీనిలో కార్మికుల యూనియన్లు నిర్వహించిన పాత్ర నామమాత్రం. ఏమైనప్పటికీ సుసంఘటితమైన కార్మిక

శక్తి విషయంలో అమెరికాలోనివారికి, ప్రపంచం లోని యితర దేశాలవారికి మధ్య ఎంతగా తేడా వున్నప్పటికీ అమెరికా వ్యవస్థ మొత్తంగా అభివృద్ధి చెందడానికి వారు కూడా హెచ్చుగానే సహాయ పడినమాట నిజం.

సంస్థలు :

ఆర్థికంగా అమెరికా అభివృద్ధిని వివరించడంలో నేమి, పెట్టుబడులను సమీకరించి వినియోగించు కొనడంలో నేమి, పెద్ద పెద్ద సంస్థలు (కార్పొరేష నులు) ప్రముఖ పాత్రను నిర్వహించా యనడం నిర్వివాదమైన అంశం. ఈ కార్పొరేషనుల నుంచే విస్తృత యాజమాన్యం, మేనేజిమెంటు, బాధ్యతల గుర్తింపు అనేవి ఆవిర్భవించాయి. ఆదర్శప్రాయ మైన కార్పొరేషన్ నిజానికి ఒక ప్రజా సంస్థ వంటిది. పనివారే యాజమాన్యం వహించే సంప్ర దాయం హెచ్చుతూ వుంది. ఉద్యోగ వర్గాలవారు తమ సొమ్మును కంపెనీ వాటాలలో పెట్టుబడి పెడుతున్నారు కూడా. పెట్టుబడి ప్రయోజనాలు, యాజమాన్యం, ప్రజాస్వామ్య బద్ధం కావడ మనే వాటి ద్వారా పటిష్ఠమైన ప్రజాబలం కలిగిన వ్యవస్థ కావడానికి వీలు కలుగుతూ వుంది.

మనమిప్పుడు నవ శక ప్రారంభంలో వున్నామా?

దాని చరమ దశను చేరుకొంటున్నామా? దీనికి సమాధానం అనేక విషయాలపైన ఆధారపడి వుంది. ప్రపంచ యుద్ధ నివారణకు మనం అందరం ఎదుర్కొన్న సవాలుకు పిమ్మట - అమెరికన్ కేపిట లిజం మరొక ఆర్థిక మాంద్యాన్ని ఎదుర్కొన గలమా లేదా అనే సవాలునే నేడు ఎదుర్కొం టున్నది. ఆర్థిక మాంద్యాన్ని ఎదుర్కొన గల శక్తి 1929 లో కంటె ఈనాడు వర్తక వాణిజ్య వర్గాలకు హెచ్చుగా వుంది. కేవలం ప్రభుత్వం మాత్రమే ఈ పనిని ఒంటరిగా చేస్తూ వుండడాన్ని మీరు చూస్తూ ఊరుకొనరాదు. ప్రభుత్వం చెయ్యకలిగినది చాలా వుండవచ్చు. కాని వర్తక వాణిజ్య వర్గాలకు తొలి బాధ్యత వుంది. ఆర్థికంగా రాగల ఒడుదుడు కులను తట్టుకొనడానికి తగిన ఏర్పాట్లతో మీరు ఎప్పటి కప్పుడు సిద్ధంగా వుండాలి.

ప్రయివేటుగా ఉమ్మడి చర్యలకు తాము చేసు కొన్న ఏర్పాట్లను మీరు పూర్తిగా వినియోగించు కోవాలి. కార్మికుల సహకారం పొందడానికి సిద్ధ పడాలి. ఇలాంటి సమయాలలో వినియోగించ డానికి అనువగు రిజర్వు నిధుల ఏర్పాటుకు అనువుగా పన్నులు విధించే శాసనాల సవరణను మీరు గట్టిగా కోరాలి. ఈవిధంగా చెయ్యడంవల్ల మీరు తమకు

తాము మాత్రమే కాక ఈ పుస్తకంలో వివరించ బడిన విలువలను కూడా కాపాడుకోనగలరు. అమెరికాలో తీవ్రమైన ఆర్థిక మాంద్యం ఏర్పడితే ప్రపంచంలోని ప్రతి స్వతంత్ర రాజ్యం దెబ్బ తినగలదు. నియంతృత్వ వాదులకు దీనివల్ల ఎక్కువగా లబ్ధి కలగ గలదు. ఈ పరిస్థితిని ఎదుర్కొని, ఒడుదుడుకులను సరిచేసుకున్నపుడు వర్తక వాణిజ్య వర్గాలు మరింతగా ముందుకు పోగల అవకాశాలను పొందగలవు కూడా.

మనం వ్యవస్థాపన (ఆర్గనైజేషనుల) యుగంలో నివసిస్తున్నాము. కట్టు మిషనులతో జట్టుగా పనిచేసే చోటునుంచి, నియంతృత్వ ప్రభుత్వం వరకు వ్యక్తుల జీవితాలలో వ్యవస్థాపన అనేది నానాటికి ప్రముఖ పాత్రను నిర్వహిస్తూ వుంది. ఈ మార్పులో కొంత వాంఛనీయమైనది' వాస్తవిక స్వాతంత్ర్య పరిధుల నిది విస్తరించగలదు. ఈ మార్పులో కొంత అవాంఛనీయమైనది. అది నిరంకుశత్వానికి ఒక అవకుంఠనంగా వుంది.

యునైటెడ్ స్టేట్స్‌లోనూ, అదే ధోరణిలో ముందుకు పోతున్న మరి కొన్ని దేశాలలోను

కూడా ఐచ్ఛికమైన ప్రయివేటు వ్యవస్థాపన (లేక ఆర్గనైజేషన్) అన్నది ఒక నూతన సాంఘిక శక్తిగా రూపొందింది. సువిశాలమైన ఖండంలో వైవిధ్యాలతో కూడిన సమాజంలో ఈ వ్యవస్థ విశిష్టంగా పనిచెయ్యడానికి వీలుగా అమెరికను లందరు సహకార భావంతో కృషి చెయ్యడం అవసర మౌతున్నది. ఇది జరగనపుడు అశాంతి, అరాచకం, కల్లోలం, ప్రభుత్వపు గుత్తాధికారం తప్పనిసరి కాగలవు.

ఇన్‌లాండ్ స్టీల్ కార్పొరేషన్ ప్రెసిడెంట్, ప్రపంచ వాణిజ్య విధానానికి చిత్తును తయారుచేసే కమీషన్‌కు ప్రెసిడెంట్ ఐసెన్‌హోవర్‌చే అధ్యక్షుడుగా నియమించబడిన క్లారెన్స్ రాండాల్ 'ది క్రీడ్ ఫర్ ఫ్రీ ఎంటర్ ప్రైస్' అనే పుస్తకంలో "మనది ఐచ్ఛికమైన వ్యవస్థల జాతి. మన సమకాలిక చరిత్ర రచించబడినప్పుడు ప్రజాస్వామ్య మార్గంలో మానవుల సంక్షేమానికి మనం సమకూర్చిన విప్లవాత్మకమైన కృషి యిదేనని పేర్కొనబడవచ్చు" నని వ్రాశాడు. ఈ విషయంలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు. యునైటెడ్ స్టేట్స్‌లో ఐచ్ఛికంగా ఏర్పడిన ప్రయివేటు సంస్థల శక్తిని గుర్తించక తప్పదు. ఇలా సంస్థలుగా ఏర్పడడం అమెరికనులకు

సహజ లక్షణం. ఈ లక్షణాన్ని కొందరు ఎగతాళి చేస్తూ వుంటారు. విచిత్రమైన టోపీలన్నా, సమూహంగా పాటలు పాడుకోనడమన్నా మనకు మోజు హెచ్చు అని కూడా కొందరు యూరోపియనులు అంటూ వుంటారు.

సహజమైన ఈ సాంఘిక లక్షణానికి చక్కని పునాది వుంది. స్వాతంత్ర్యాన్ని కాపాడుకోవాలంటే సహకారానికి, ఉత్తర ప్రత్యుత్తరాలకు, రాకపోకలకు పూర్తి అవకాశాలుండాలి. ఈ అవకాశాలను యిదివరకు ఎన్నడూ లేనంతగా గత 25 సంవత్సరాలలోను మనం కలిగించాము. ఇందులో ముందుగా అనుకొని మనం చేసినది ఏమీ లేదు. చివరకు వీటి ఫలితాలు ఎలా వుండగలవని ఆలోచించుకొన్నదీ లేదు. కొన్ని సంస్థలను గురించి ఎక్కువగా చెప్పడం జరిగింది కూడా. కాని రకరకాల సంస్థలకు మూలశక్తిగా సమాజంగా జీవించవలసిన అవసరం మార్క్సిస్టులదీ - ప్రభుత్వానిది కాక, ఇచ్ఛికంగా స్వేచ్ఛగా పరస్పరం పంచుకొనడం, సమష్టిగా వ్యవహరించడం అనేవి ఈ విచిత్రములైన టోపీల మరుగున అణగి వున్నాయి.

ఏమి జరిగినదీ స్పష్టంగా తెలుసుకోవాలంటే 1850 తో పోల్చినప్పుడు 1953 లో కానవచ్చే

సంస్థల వివరాలు మనకు విభ్రాంతి కలిగిస్తాయి. 1853 లో కార్మికుల యూనియను లనేవి దాదాపు లేనే లేవు. కాని ఈనాడు సంఘాలుగా ఏర్పడిన కార్మికులు 1,50,00,000 మంది యునైటెడ్ స్టేట్స్‌లో వున్నారు. 1853 లో వ్యవసాయదారుల సంఘాలు లేవు. కాని ఈనాడు దేశంలోని వ్యవసాయదారులలో సగం మంది మూడు జాతీయ సంఘాలను ఏర్పాటు చేసుకొని వున్నారు. 1853 లో వున్న పెద్ద వ్యాపార సంస్థల సంఖ్య చాలా తక్కువ కాని, నేటి ఆర్థిక వ్యవస్థలో పెద్ద కార్పొరేషనులే ప్రధాన భాగస్వాములుగా వుంటున్నాయి. చిన్న చిన్న వ్యాపారాలు కూడా కార్పొరేషన్‌లు గానే రూపొందుతున్నాయి.

1853 లో యజమానుల సంఘాలు కాని, వాణిజ్య సంఘాలు గాని యునైటెడ్ స్టేట్స్‌లో లేనే లేవు. కాని ఈనాడు 1500 జాతీయ వాణిజ్య సంఘాలు వున్నవి. ప్రాంతీయ, స్థానిక సంఘాలుకూడా అనేకం వున్నాయి. ఇలాగే ఇదేవిధంగా సౌభ్రాతృత్వ సంఘాలు, మత సంఘాలు, ధర్మసమాజాలు, విజ్ఞాన సమితులు అనేకం వున్నాయి.

1853 లో అమెరికనుల వ్యక్తిగత జీవనంలో ప్రభుత్వం నిర్వహించగల పాత్ర అతి స్వల్పమైనది.

ఇంచుమించుగా అన్ని దేశాల పౌరుల విషయంలోను యుంతే. వ్యక్తిరాబడిలో స్వల్పభాగాన్నే అది పన్నుల రూపంలో తీసుకొనేది. ఈనాడు ప్రతిమానవుని జీవితంలోను జాతీయ ప్రభుత్వ ప్రభావం ప్రముఖ పాత్ర నిర్వర్తిస్తూ వుంది. పూర్తి స్వాతంత్ర్యం గల దేశాలలో పరిస్థితి కూడా యుంతే.

ఈ సంస్థలను వాటి ఆర్థిక ప్రాధాన్యం దృష్ట్యా, మానవ సంక్షేమ స్వాతంత్ర్యాలతో వాటికి గల సంబంధాల దృష్ట్యా, వాటిని మనము రెండు జట్లుగా విభాగించ వచ్చు.

(1) సాంఘిక సంక్షేమానికి ఉద్దేశించబడిన సంస్థలు. సేవాసమాజాలు, ధార్మిక సంస్థలు, మత సంస్థలు మొదలైనవి.

(2) ఏదో ఒక ప్రత్యేకమైన వ్యాపారానికి వృత్తికి, వర్గానికి ఉద్దేశించబడినవి. కార్మిక సంఘాలు, రైతు సంఘాలు వంటివి.

ఈ విధంగా ప్రతి సంస్థ ప్రభావం స్వతంత్ర సమాజంపై ప్రసరిస్తుంది. వివిధ తరహాలకు చెందిన ఈ సంస్థలు గత కొన్ని దశాబ్దాలలోను విశేషమైన పురోభివృద్ధిని పొందాయి. అమెరికాలోని పౌరులు సాంఘికావసరాలను తీర్చవలసిన బాధ్యతలను గుర్తించి నిధుల ద్వారాను, సేవా సమాజాల

ద్వారాను ఐచ్ఛికమైన ఏర్పాట్లను చేసుకొననప్పుడు తప్పనిసరిగా ప్రభుత్వపు జోక్యం అవసరమయ్యేది. ఉన్నత భావాలు గల పౌరులు కొందరు సాంఘిక సేవకు వినియోగిస్తున్న కాలాన్ని చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. వర్తక వాణిజ్య వేత్తలలో పెక్కుమంది తమ పనులకు ఎంత కాలాన్ని వినియోగిస్తారో అంత కాలాన్ని, శ్రమను, ప్రతిఫలాపేక్ష లేకుండానే ఐచ్ఛికంగా సామాజిక సేవకు వినియోగిస్తారు. వీరు ఈవిధంగా చేసే సేవ ప్రభావం వారి స్వంతపనులవల్ల కంటె హెచ్చుగా వారి సమాజం మీద, మొత్తం సాంఘిక వ్యవస్థమీదా ప్రసరిస్తూ వుంటుంది.

# 8

అమెరికా సాంఘిక చిత్రాన్ని, అర్గనై జేషనుల రూపంలో చూచినప్పుడు, సమష్టి బాధ్యతతో కూడిన బృహత్తరమైన పద్ధతి దానిలో కాన వస్తుంది. ఈరకమైన కార్యక్రమం సమాజంలోని పౌరసత్వాన్ని వ్యక్తం చేస్తుంది. వ్యక్తిత్వంయొక్క ప్రాధాన్యాన్ని ఐచ్ఛికమైన సహకారంలో ఉత్తమంగా భద్రపరచ వచ్చునని గుర్తింప చేస్తుంది. సంఘంలో తన వంతు పనికి వ్యక్తి ఆమోదిస్తాడు. ఆధునిక సమాజంలో పెక్కురకాల భారాలు, నానా

టికి పెరుగుతూ పోగల సాంఘికమైన అవసరాలు, అనేకం కలవని గుర్తిస్తాడు. ప్రభుత్వ పాత్రను సాధ్యమైనంత తక్కువగా వుంచాలని అతను కోరుకుంటాడు. కనకనే, నిరంతరం తగినంత చైతన్యంతో కానప్పటికి, అతను తన బాధ్యతను ఆమోదించి, తన పనిని చేసుకుంటాడు.

మనం అప్పుడప్పుడు భావిస్తూ వుంటాము— ప్రభుత్వం మించిన బాధ్యతలను స్వీకరిస్తున్నదని, మనం "శ్రేయోరాజ్య" మార్గాన పోతున్నామని. కాని ఎప్పుడైనా, ఎవరైనా, "శ్రేయస్సు" అనే దానికి ప్రభుత్వం ద్వారా ఎంత కాలాన్ని, ఎంత సొమ్మును ప్రజలు వెచ్చించారో, ప్రభుత్వం ద్వారా కాకుండా ఎంతకాలాన్ని, సొమ్మును వెచ్చించారో పోల్చి చూశారా ?

దేశం మొత్తం మీదవున్న సామాజిక నిధులన్నింటిని మొత్తంచేసి చూడండి. అనేక కారణాల వల్ల వానిలో కలవకుండా వుంటున్న అనేక సంక్షేమ సంస్థల బడ్జెట్టులను కూడా ఈ మొత్తంతో చేర్చండి. చర్చిలద్వారా వుంటున్న సంక్షేమ సమాజాలను కూడా కలపండి. ఎలాంటి ప్రతిఫలం తీసుకోనకుండా, వీని తరఫున పనిచేసే ఆర్గనైజర్లు, సొలిసిటర్లు వగైరాలు వినియోగించే కాలాన్ని, శ్రమను

కూడా, డబ్బురూపంలో మదింపవేసి, దానికి కల పండి. ఈ మొత్తమంతా చేరితే, పన్నుల ద్వారా చెల్లించే ఆదాయంతో సంక్షేమ కార్యక్రమాలకు చేసే వ్యయంకంటే, హెచ్చుగా వుండి తీరుతుందన డంలో నాకేలాంటి అనుమానం లేదు.

సాంఘిక ఉద్యోగాలను ఐచ్ఛికంగా ఆమోదించి అమలు జరపడమనేది మన కాలంలో, స్వతంత్ర సమాజనిర్మాణంలో మనం కనుగొన్న కొత్త సూత్రంగా వుంది. అంటే శ్రేయోరాజ్యమనేది తప్పనిసరికాదు అని దీని అర్థం. సంక్లిష్టమై, భద్రత లేనట్టుగా పైకి కనిపిస్తున్న మన సమాజంలో కాన వచ్చే సవాళ్ళలో చెక్కింటిని, వ్యక్తులు ఐచ్ఛికంగా కలిసి మెలిసి ఎదుర్కొన వచ్చునని దీని అర్థం. ఈ పరిష్కారమార్గం మిగతా ప్రపంచానికి తప్పనిసరిగా తెలియవలసి వుంది. మరొకచోట, కొన్ని ప్రాంతా లలో, పోల్చి చూడదగిన నమూనా ఒకటి రూపొం దింది. ఐచ్ఛికమనేది ప్రపంచం మొత్తం మీద అక్కడా ఇక్కడా వుంది. ఇందులో పూర్వకాలపు సంప్రదాయాలు వున్నాయి. అయితే శ్రేయోరాజ్య మనేది కూడా సొంతనంగానే వుంది. అయినప్పటికి ప్రత్యామ్నాయమైన మన పద్ధతికి తగినంత హెచ్చు

ప్రచారమిచ్చి, మరింత హెచ్చుగా పరిశోధనలు జరిపించాలి.

స్వచ్ఛందంగా స్వయం సహాయం చేసుకొనే ఆర్గనైజేషనులు కూడా ప్రధానమైనవే. అనేక సాంఘిక సమస్యల పరిష్కారానికి అవి తోడ్పడినాయి. కార్మిక, వ్యవసాయ సంఘాలు ఆర్థికమైన బలాన్ని సమంగా వుంచడానికి సహాయపడినాయి. 19 వ శతాబ్దంలో ఆర్థిక బలం చాలవరకు యజమానిలో కేంద్రీకరించబడి వుండేది. కాని ఈనాడు అధికార మనేది సమతలంగా వుంది. ఉభయ వర్గాలు, ఆవలివర్గం బలంగా వుందనే యోచనలలో వుంటున్నాయి. ఇదివరకే వణిక్ప్రభువులు అనుకున్నట్టుగానే, ఈనాడు కార్మిక ప్రభువులు అనుకుంటున్నాము. వ్యవసాయదారుల చేతులలో వున్న మార్కెట్ శక్తి, రాజకీయంగా వ్యక్తం కావడాన్ని గురించి ఎవ్వరూ తక్కువగా అంచనా వేయడం లేదు.

విభిన్నాభిప్రాయాలు వున్నా, విజ్ఞత కలిగిన రాజకీయ భావుకులు థామస్ జెఫ్ఫర్ సన్, డేనియల్ వెబ్ స్టర్ వంటివారు, స్వతంత్ర ప్రభుత్వ మనేది, దానిలోని అధికారం ఏదో ఒక రకంగా సమతలంగా సమన్వయం కానప్పుడు, అసంభవం

కాగలదని ముందుగానే చెప్పి వున్నారు. ఈ సమన్వయాన్ని సాధించడానికి ఆర్గనైజేషనులు ఎంత గానో సహాయ పడినాయి. అంతమాత్రాన అంతా సవ్యంగా వున్నట్టు భావించరాదు. ప్రత్యేకమైన విషయాలకు శ్రద్ధ చూపే ఆర్గనైజేషను లన్నింటికి వర్తించే శాసనాలను మన మింకా కోరుతున్నాం. కార్పొరేషనులు ట్రస్టులుగాను, గుత్త వ్యాపార సంస్థలుగాను పెరిగిపోకుండా శాసనాలు అనేక దశాబ్దాలుగా అడ్డు తగిలాయి.

ఒక్కొక్కప్పుడు ఈ శాసనాలనేవి, కేవలం పెద్దవిగా విస్తరణ నివారించడానికి ఉద్దేశించి నట్టుగా అమలు జరుగుతూ వచ్చాయి. కాని ఇలా పెద్దగా విస్తరణ అనేది అవసరమని, సాంఘికమైన ప్రయోజనం కలదని మన మిప్పుడు చూస్తున్నాము. ఇక మన ట్రేడ్ యూనియనులకు అదనంగా వుంటున్న అధికారాలను అణచివేయడానికి మనకు గల శాసనాలు ఇంకా ప్రయోగదశలోనే వుంటున్నాయి. ఒక యూనియనులో చేరకుండా పని చేసుకోనడానికి హక్కు అనేది వ్యక్తి ప్రతిపత్తికి ఇంకా సవాలు గానే వుంది. కొన్ని యూనియనులు తగినంతగా "ఎప్రెంటిస్ షిప్"ను(కొత్తగా పనిలో చేరిధృవీకరణను పొందగల వ్యవధిని) అటకాయిస్తున్నవి. ఇలా

యజమానికి ఆర్థికంగా వున్న శక్తికి ప్రత్యామ్నాయంగా కార్మికులకు ఇలా రక్షణ ఇవ్వడం ద్వారా ఇంత మూల్యం చెల్లించాలా లేదా అన్నది నిరంతరం చర్చనీయాంశమే కాగలదు. స్పష్టంగా చెప్పాలంటే, ఈ విషయంలో కూడా యజమానులు, కార్మికులు కూడా కొంతవరకు అతిగానే వ్యవహరిస్తున్నారు.

స్వయం సహాయం చేసుకొనే మరొక రకం ఆర్గనైజేషనులు కూడా ఇంకా హెచ్చుమంది దృష్టిని ఆకర్షించలేదు కాని, అవి కూడా ప్రధానంగా పరిగణించ దగినవే. అవి వాణిజ్య సంఘాలు, వృత్తి సంస్థలుగా వున్నాయి. అమూల్యమైన సాంకేతిక సమాచారం వీని రూపంలో సమీకరించబడుతున్నది. ఉత్తమ శ్రేణికి చెందిన అనుభవం, నైపుణ్యం వానిలో వుంది. పరస్పర సహాయపు వాతావరణాన్ని అవి కలిగివున్నాయి. అన్ని రకాలుగాను పూర్వకాలపు అనుమానాలను అవి తొలగించాయి. వ్యక్తులు గడించుకున్న విజ్ఞానాన్ని వినియోగించుకొని అందరూ లాభం పొందవచ్చునని, ఒకరి నుంచి ఒకరు తెలుసుకొనడం ఉత్తమ మని, ఈ సంస్థలు అమెరికా పారిశ్రామికులకు, వృత్తుల పరంగా వున్న నాయకులకు నేర్పాయి.

ఇలాంటి సంఘాలు కూడా, కార్మిక సంఘాలకు

ఫలెనే గుత్త సంస్థలు, లేక పరిమితమైన సంస్థలు కాగలవు కాని, అలాంటి దుష్పరిణామాలను అరికట్ట గల శాసనాలు మనకు వున్నాయి. మొత్తం మీద వీని పలుకుబడి ప్రయోజనకరమైనది; నిర్మాణాత్మక మైనది. వీని వల్ల యునైటెడ్ స్టేట్స్ ఉత్పాదక శక్తి ఎంతగా హెచ్చిందీ అంచనా వేయడం కష్టం. మార్కెట్‌లో "ప్రాసెసింగ్"కు ఇవి చాలా సహాయపడినాయి. తద్వారా యునైటెడ్ స్టేట్స్ లోని ఏ ప్రాంతంలో నివసిస్తున్నా, అక్కడి వారికి ఒకే రకమైన దుస్తులు, మోటారు కార్లు, ఇంటి సామానులు, తిను బండారాలు, రేజరు బ్లేడులు, సినిమాలు, రేడియో కార్యక్రమాలు, సుగంధ ద్రవ్యాలు వంటివి, ఒకే రకపు జీవితానికి అనువగు భౌతికమైన అవసరాలు అందుబాటు చేయడానికి వీలు కలిగింది.

ఇలా బ్రతుకును మూసపోయడాన్ని ప్రజలు సహేతుకంగానే విమర్శిస్తారు. కాని ఇలా మూస పోయడంవల్ల వచ్చిన నష్టంకంటె, దీని ద్వారా కలి గిన లాభాలు – విపరీతంగా ఉత్పత్తి, అంతులేని మార్కెట్ లభించింది. అంటే అనేకమంది ప్రజల జీవన ప్రమాణం పెరిగిందన్నమాట. అమెరికనులలో హెచ్చుమంది జీవిత విధానాలలోని ఏకత్వంవల్ల వర్గ

రహిత సమాజపు ధోరణి దీనిలో ప్రతిధ్వనించింది. ఇలా పొందిన ఏకత్వంలో, అమెరికనులు తమ వ్యక్తిత్వాలను ప్రదర్శించడానికి అంతులేనన్ని మార్గాలను కనుగొన్నారు. ముఖ్యంగా తమ గృహాలంకరణలలో విపరీతమైన వైవిధ్యాన్ని వ్యక్తం చేస్తున్నట్లు, ఈ విషయాన్ని ప్రత్యేకంగా పరిశీలించిన హారీ హెండర్సన్, 1953 నవంబరులో వచ్చిన హార్పర్స్ మేగజీనులో వ్రాసివున్నాడు. చివరకు ఒకే రకమైన భవనాలలో నివశించడంలో కూడా ఫిర్యాదులు రాలేదని ఆయన విచారించి చెప్పాడు.

అర్గనైజేషనుల విలువనుగురించి ఇంతగా చెబుతున్నప్పుడు, కొన్నిరకాల హెచ్చరికలు చేయడం అవసరం. గ్రూపుల ఘనతను కీర్తిస్తున్నప్పుడు, మొత్తం సమాజాన్ని విస్మరించరాదు. గ్రూపు ప్రత్యేకత అనేది సమాజం మొత్తం శ్రేయస్సును మించనివ్వరాదు. అదీకాక, వ్యక్తికూడా గ్రూపు తరఫున వ్యవహరిస్తూ, చివరకు తన స్వార్థాన్ని కూడా చేర్చుకొనడంవల్ల, సమాజం మొత్తానికి ప్రమాదం కలిగించవచ్చు. గ్రూపు తత్వమనేది చివరకు పచ్చిస్వార్థం కావచ్చు. కనక జాతి, అభిమానం, ఆర్థికంవంటి స్వార్థాలకు అవకాశం లేకుండా సామాజికమైన వర్గాలు వుండవచ్చు. దీని

నిధి కేవలం పై వారిదిగానో - కేవలం కిందివారిదిగానో వుండరాదు కూడా. అలా వుంటే అది విఫలమౌతుంది. యజమాని-ఉద్యోగి, లేదా విభిన్న జాతులకు, అభిమతాలకు చెందినవారు, ఎంతగా కలిసి మెలిసి వ్యవహరించుకుంటూ, సామాజిక శ్రేయస్సుకు ఎంతగా కృషి చేసుకుంటూ వస్తే, అంత ఆనందంగా మనం జీవించగలం. ఈ లక్ష్యం కొన్ని ప్రాంతాలలో సిద్ధించింది. అయితే ప్రయోజనకరమైన ప్రత్యేకమైన గ్రూపులు కూడా వుండవచ్చు. అయితే సామాజిక చర్యలకు చెందిన అంతర్గతమైన సమూనాలు, విద్వద్గోష్ఠులు అనేకం వుండాలి కూడా.

వీటన్నింటికిపైన, జాతి మొత్తానికి ఈ రక్షణ వర్తిస్తుంది. జాతి శ్రేయస్సుకోసం, మొత్తం ప్రజల తరఫున మాట్లాడడానికిగాను మనకు రాజకీయమైన, సాంఘికమైన, భావనాబలం కలిగిన నాయకులు కూడా కావాలి. ఈ అవసరం కేవలం మన జాతికే పరిమితం కాదు. మొత్తం మానవజాతి శ్రేయస్సుకు కూడా మనం హెచ్చుగాను, సమానంగాను శ్రద్ధ చూపాలి. ఐచ్ఛికమైన సంస్థలతో ప్రజాసిద్ధాంత బలంతో మనం ముందుపోతూ భవిష్యత్తులోని అవసరాలను తీర్చుకొనేటప్పుడు, మన దృష్టిని

సంకుచితమైన గ్రూపులనుంచి మన జాతి హద్దుల నుంచి కూడా ఆవలకు ప్రసరింపజేయాలి. మన పద్ధతులను ప్రపంచ సమస్యల పరిష్కారానికి వినియోగించాలి.

# 9

అమెరికా వణిక్ప్రముఖులు ఈ రోజుల్లో సాంఘిక బాధ్యతలకు సంబంధించిన సిద్ధాంతాన్ని ఘనంగా ప్రశంసిస్తున్నారు. విందులలో జరిగే ఉపన్యాసాల లోను, తమ వాణిజ్య సంఘాల సమావేశాలలోను చక్కని కరపత్రాలుగా తిరిగి ముద్రించుకున్న తమ ప్రసంగాలలో కూడా—సాంఘిక బాధ్యతను ఆమోదించాలి లేదా, సమసిపోవాలి అని నొక్కి వక్కాణిస్తున్నారు.

వీరు ఇలా ఆమోదించడం ఎంతవరకు నిజం? అసలు దీని నిజమైన అర్థం ఏమిటి? ఈ విశ్వాసం ఎక్కడనుంచి వచ్చింది? అది ఎంతకాలం వుంటుంది? ఏమైనప్పటికి, అసలు సాంఘిక బాధ్యత అంటే ఏమిటి?

స్టాండర్డు ఆయిల్ కంపెనీ (న్యూజెర్సీ)లోని ఒక డైరెక్టరు, యింపీరియల్ ఆయిల్ లిమిటెడ్ (టొరెంటో) బోర్డు చెయిర్మన్ అయిన మిస్టర్ పియర్స్ ఈ విషయాన్నే చక్కగా క్రిందివిధంగా

ట్లు_ష్టీకరించి చెప్పాడు:. "ప్రయివేటు వ్యాపార మనేది తన మనుగడకుగాను, ఈ కింది మూడు శక్తులమధ్య సమానమైన ఫలితాల నివ్వగల సంబంధాలను కలిగించేటట్టు చూడడం తప్పనిసరి అని నాకు స్పష్టంగా కనిపిస్తున్నది. లాభాలు తీయడానికి వ్యక్తులకుగల హక్కు, సాంఘికంగావున్న అవసరం. అందరి కార్మికులకు ఆర్థికంగాను, మానవులుగాను వున్న ఆశలు; తక్కువ ధరకు విశేషంగా సరుకుల సప్లయిని కోరుతూవుండే ప్రజల అభిమతం; దీనిని కాదన్నప్పుడు ఉధృతంగా పారిశ్రామిక సంఘర్షణలు, ఓర్మిలేని ప్రజలుచేసే బలవంతంతో, ప్రభుత్వం తప్పనిసరిగా నానాటికి హెచ్చుగా జోక్యం కలిగించుకొనడం తథ్యం కాగలదు."

ఇలా మిష్టర్ పియర్స్ కేవలం వట్టి మాటలను చెప్పలేదు. ఆయన కంపెనీల విధానాలన్నింటికి ప్రాతిపదికలు యివేనని స్పష్టంగా కనిపిస్తున్నది. దేశం మొత్తంమీదనే ఈ సూత్రాలను గుర్తించడం జరిగింది కూడా. ఆయన మిత్రుడు, న్యూజెర్సీకి చెందిన స్టాండర్డు ఆయిల్ బోర్డు చెయిర్మన్ ఫ్రాంక్. డబ్ల్యు. అబ్రామ్స్ కూడా ఈ విషయాన్నే కిందిమాటల్లో చెప్పాడు. "సంక్లిష్టమైన నేటి ప్రపంచంలో వ్యాపారాన్ని చక్కగా నిర్వహించడానికి మొదటి

పరతు-ప్రజాశ్రేయస్సును గురించి వున్న బాధ్యతను స్పష్టంగా గుర్తించి, దానితో సంలీనమై పోవడం."

ఇందులో ఈ అబ్రామ్స్‌గాని, ఈ పియర్స్‌గాని న్యూజెర్సీ స్టాండర్డ్ ఆయిల్ కంపెనీకి యజమానులు కాదు. అనేకమంది స్టాక్ హోల్డర్ల తరఫున పని చేస్తున్న ఉద్యోగులు వారు. మనదేశపు శాసనాల ప్రకారం, వారి కంపెనీ నిబంధనలను బట్టి, వారే అన్నింటికి సంజాయిషీదారులు. చట్ట రీత్యా ఇలా వున్న బాధ్యత కంటె కూడా, నేటి ప్రపంచ వ్యవస్థలో పరస్పరం ఆధారపడి వుండడమనే దాని ప్రాధాన్యాన్ని స్పష్టంగా గుర్తించడమనేదే గణనీయమైన విశేషంగా వుంది.

వీరి దృక్పథం ధర్మకర్తల దృక్పథం వంటిది. తమ స్టాక్ హోల్డర్లకు, ఉద్యోగులకు, ప్రజలకు, ప్రభుత్వానికి వీరు ట్రస్టీలు. పెక్కు విధాలుగా అనేక రకాల క్రమ శిక్షణలతో, అధికార పత్రాలతో వీరు సంజాయిషీ చెప్పుకోనవలసి వుంది.

ఆధునిక వాణిజ్యంలో వీరి బాధ్యతలు ఎలాంటివో కారన్ ప్రాడక్ట్సు రిఫైనింగ్ కంపెనీ ప్రెసిడెంటు మారిస్ సేరా, కింది మాటలలో గట్టిగా చెప్పి వున్నాడు. "దీనిని గురించి మనకు దాపరికం లేదు. రెండు మూడు తరాల కిందట మేనేజిమెంటులకు

చెందిన మన పూర్వీకులు తమ ఉద్దేశాలను గురించి, తమ విశ్వాసాలను గురించి, ప్రజలపట్ల తమకు గల బాధ్యతలను గురించి ఆత్మ పరిశోధనకు కేవలం-స్వల్ప కాలాన్నయినామాత్రమే వినియోగించివుంటే, ఈనాడు మనం ఎదుర్కొంటున్న క్లిష్టమైన కొన్ని సమస్యలు ఏర్పడేవే కావు. మనలోని సాంఘిక చైతన్యం, సాంఘిక బాధ్యతలకు వ్యక్తిగతమైన గుర్తింపువల్ల, మనం తప్పని సరిగా, వ్యక్తులుగా, మేనేజిమెంటులోని ప్రతి విషయాన్ని, ప్రతి విధానాన్ని, సామాన్యమైన కొల బద్దతో కొనవలసి వుంటుంది. అది 'దీనివల్ల నాకు రాగల ప్రయోజన మేమిటి?' అనే ధోరణిలో కాక, 'నా ఖాతాదార్లకు, నా సప్లయి దారులకు, నా స్టాక్ హోల్డర్లకు, నా ఫ్యాక్టరీ నెలకొల్పబడివున్న ప్రాంతం వారికి, నా ప్రభుత్వానికి, నేను భాగస్వామిగా వున్న పరిశ్రమకు, దేశంలోని మొత్తం ఆర్థిక వ్యవస్థకు కలగనున్న లాభం ఏమిటి?' అని ఆలోచించాలి. ఈ పరిశీలన ప్రతి మేనేజిమెంటు చర్యలలోను, విధానాల లోను, ఆచరణలోను కొనసాగినప్పుడు, అది నిజమైన సాంఘిక చైతన్యానికి నిదర్శనం కాగలదు."

ఈ విషయం ఇంతకు మించి ఇంకా సమగ్రంగా చెప్పవలసిన అవసరం వుంటుందా? అమెరికాలోని

కొత్త తరహా వాణిజ్య వేత్తలకు ఇదే మహోజ్జ్వల మైన మార్గాన్ని చూపుతున్నది. అయితే దీని అర్థంలో నిజమెంత? విన సొంపుగా వున్న ఈ మాట లను కార్య రూపంలో పెట్టడానికి వీరు చేసిం దేమిటి? అమెరికా ఆర్థిక వ్యవస్థలోని వాతా వరణాన్ని మొత్తంగా వీరు మార్పు చేశారన్నదే దీనికి సమాధానం.

యాజమాన్యం అనేది పోయింది. ధర్మకర్తగా వుండడమనేది వచ్చింది. అనేక కారణాలవల్ల - స్టాక్ హోల్డర్లు హెచ్చుమంది వుండడం, శాసనాల రీత్యాను, ప్రభుత్వం రీత్యాను, కంట్రోలు సంబం ధించిన చట్టాలు రాగలవనే బెదిరింపు, ప్రజాభి ప్రాయపు వత్తిడి వంటి కారణాలవల్ల ధర్మకర్తగా వ్యవహరించాలనే భావం బలపడింది. వ్యాపారం చాలవరకు ప్రజాభిప్రాయం మీద ఆధారపడి వుంది. అది తన వస్తువులను ప్రజలకు విక్రయించాలి. అలా ప్రజలకు సేవ చేయాలి. ప్రజలనుంచి తనకు కావలసిన కార్మికులను సమీకరించుకోవాలి. రాజకీయమైన చర్యలో ప్రజల కోపాగ్నిని లేదా, ఓర్మిని సహించాలి. ఆ విధంగా ఈ నాడు వ్యాపారం అంటేనే సాంఘిక చైతన్యం అనే కొత్త అర్థం వచ్చింది.

మేనేజిమెంటుల సాంఘిక బాధ్యతలను గురించి

ఈ మధ్యనే జరిగిన ఒక చర్చలో సి. ఇ. ఓ. కు చెందినవిద్య, పరిశోధనల విభాగం డైరెక్టరు స్టాన్లీ రుబెన్ బర్గ్ మాట్లాడుతూ మేనేజిమెంటులకు ప్రత్యేకమైన పూచీ వున్న నాలుగు సూత్రాలను ఉదాహరించాడు. మేనేజిమెంటులు తమ సాంఘిక బాధ్యతలను స్వీకరిస్తున్న వనడానికి కార్మికులు కోరే నిదర్శనాలలో బహుశా ఈ నాలుగు సూత్రాలు కూడా చేరి వుండగలవు. ఆ నాలుగు సూత్రాలు ఏమిటంటే (1) స్థానికంగా సమాజం పరిస్థితులను మెరుగు పరచడానికి కృషి చేయడం. (2) సమష్టిగా కోర్కెలను సాధించుకునే సూత్రాన్ని ఆమోదించి, కార్మిక సంస్థలతో—అవి కూడా చిర కాలం మనగల సంస్థలని గుర్తించి, వానితో కలిసి పని చేయడం. (3) శాస్త్రబద్ధంగా మేనేజిమెంటుల నిర్వహణపట్ల కార్మికులకు గల భయాందోళనలను, అపోహలను తొలగించడం. (4) అందరు కార్మికులకు పనులు లభింపజేసేటట్టుగా వర్తకవ్యాపారాలు నిర్వహించడం.

ఇలా వున్న కార్మికులకు చెందిన ఈ నాలుగు సూత్రాలను అమెరికా పారిశ్రామిక, వాణిజ్య వేత్తలు ఎంతవరకు ఆమోదించి, అనుసరిస్తున్నారు? స్థానికంగా సమాజపు స్థితిగతులను మెరుగు పరచ

డానికి కృషిచేయవలసిన అవసరాన్ని స్థూలంగా అందరూ గుర్తిస్తున్నారు. ఇందులో కేవలం కొద్ది మంది మాత్రమే పాల్గొనలేకపోతున్నారు. కార్మికులు కూడా ఈ సాంఘిక బాధ్యతను పూర్తిగా యజమానులు గుర్తించారని విశ్వసించలేకుండా వున్నారు. కాని ఈ గుర్తింపుకలదన్న ఆధారాలుమాత్రం నానాటికి పెరుగుతున్నాయి. పోతే, కార్మికులు సమష్టిగా కోర్కెలు సాధించుకొనడమనేది కేవలం చుట్టుకొత్త అమలుజరపడం మాత్రమేకాక, నిర్మాణాత్మకమైనదిగా, వినియోగించుకొనడానికి అనువైన-ఒక సంస్థకు మరొక సంస్థకు మధ్య వుండదగిన సంబంధంగా కూడా పరిగణిస్తున్నారు. ఇక శాస్త్రీయంగా మేనేజిమెంటుల నిర్వహణపట్ల కార్మికులకు భయాందోళనలు, అపోహలు అవగాహనం చేసుకొనడంలో కూడా, కార్మికుల హృదయపూర్వకమైన యోచనలతో కూడిన సహకారమనేది లేనప్పుడు అధికోత్పత్తి జరగదనే విషయాన్ని గుర్తించకుండా వున్న యజమాని ఈ నాడు దాదాపు ఒక్కరు కూడా లేరు.

రుటెన్‌బర్గు చెప్పిన నాల్గవసూత్రం, కార్మికులందరికీ పనిచేసుకొనే అవకాశాలకు పూచీ యివ్వడమనేది విశాలమైన, విచారణ చేయదగిన

అంశంగా వుంది. కార్మికులందరికీ పనులు చేసుకొనగల అవకాశాలకు పూచీ ఇవ్వడానికి మాత్రమే మేనేజిమెంటులు వ్యాపారాన్ని, పరిశ్రమలను నడుపుతున్నవా అనేది వివాదాస్పదంగా వుంది. అందరికీ పూర్తిగా పనులు చూపగల పూచీ మేనేజిమెంటులు ఇవ్వలేని మాట నిజం. ఉత్పత్తి తగ్గిపోవడమనేది ఒక్కొక్కప్పుడు తప్పించుకొనడానికి వీలులేనిదిగా వుంటుంది. కాని విజ్ఞతకలిగిన మేనేజిమెంటు, అందరికీ పనులు చూపడానికి శక్తికొలది ప్రయత్నాలు జరిగినవనే నమ్మకం కార్మికులకు కలిగించే యత్నంచేసి తీరాలి. అయితే ఇలా అన్ని సందర్భాలలోను జరగడంలేదు. బాధ్యతలేకుండాను, చిత్తం నచ్చినట్టును అనుసరించే అలవాట్లు కొన్ని వున్నాయి. అవి కాలం గడిచినకొలదీ తగ్గిపోగలవు. మొత్తంమీద సంతృప్తికరమైన పరిస్థితి ఇంకా కను చూపు మేరలోనే వుంది. అయితే ఆర్థిక సమస్యల పరిష్కారంలో కార్మికుల పాత్రను, అతిగా 'కలిసి నిర్ణయించాలనే' వరకు తీసుకురాకూడదు. సమష్టి నిర్వహణ అనేది, ఒక రకమైన పారిశ్రామిక సోషలిజం. కార్మికులు తమ పాత్రను సముచితంగా నిర్వహించడానికి అనువుగా వాంఛనీయమైన కృషి జరగాలి. కాని అది మేనేజిమెంటుల కంట్రోలుకు

భంగం కలిగించేదిగా వుండరాదు. చివరి బాధ్యత, చివరి నిర్ణయమనేది నిరంతరం మేనేజిమెంటులకే వుండాలి. కాని మేనేజిమెంటులకు సాంఘిక బాధ్యతల గుర్తింపు అనేది, ఐచ్ఛికంగా కలిగే చైతన్యం కావాలి. అదే దానిలోవున్న ప్రాధాన్యం. అదే దాని చివరి సారాంశం. అదే శాశ్వతత్వానికి చక్కని ప్రూఫ్. అది ఎలా సంభవించినప్పటికి, విజ్ఞతకలిగిన స్వప్రయోజనంగా వుండితీరాలి.

# 10

అమెరికాలో ఇలాంటి కొత్త రకం వ్యాపారి ఎలా ఆవిర్భవించాడనేది చాలా క్లిష్టమైన సంగతి. బహుశా 1929 లో ప్రారంభమైన ఆర్థిక మాంద్యంలో పొందిన అనుభవాల వల్ల అతని ఆలోచనా ధోరణి మార్పుచెంది వుండవచ్చు. అప్పుడు అమెరికా వ్యాపారులు కుదుపు తిన్నారు. ఆశాభంగం చెందారు. రాటు తేరారు. తన శ్రేయస్సుకు తానంతవరకు ఆలోచించని సరికొత్త విషయాలు కొన్ని ఆధారంగా వున్నాయనే నిర్ణయానికి వచ్చారు. ఇలా వీరిలో వచ్చిన కొత్త రకం సాంఘిక చైతన్యం, కొంతవరకు ప్రభుత్వం ప్రవేశపెట్టిన, అజమాయిషీ చేసిన కొత్త విధానాల

వల్ల ఏర్పడి వుండవచ్చు. ప్రేడు యూనియన్లు సమీకరించుకున్న ఒత్తిడి వల్ల కూడా వచ్చి వుండ వచ్చు. ఇలా వచ్చిన మార్పులో కొంత మాత్రమే వాస్తవికమైనది. హెచ్చు భాగం వాచా చెప్పు కొనేదిగా వుంటున్నదనడం నిస్సందేహం.

అయితే అమెరికా వ్యాపార వర్గాలు చాల వరకు చిత్తశుద్ధితో కొత్త బాధ్యతను అంగీక రిస్తున్నాయని, దాని అవసరాన్ని చక్కగా అవగాహనం చేసుకుంటున్నాయని, సాంఘికంగా తమకు గల విధ్యుక్త ధర్మాన్ని నిర్వహించ దలుస్తున్నాయనేది ఎవ్వరూ కాదనడం లేదు. ప్రొఫెసర్ హోవర్డు ఆర్. బోవెన్, తన "సోషల్ రెస్పాన్సిబిలిటీస్ ఆఫ్ ది బిజినెస్ మేన్" అనే గ్రంథంలో, అమెరికా వ్యాపార విధానాలలో సాంఘిక శ్రేయస్సుకు సంబంధించిన శ్రద్ధ హెచ్చుగా కలదని సూచించ డానికి అనేక ఉదాహరణలను ఈ మధ్య జరిగిన సంఘటనలనుంచి పేర్కొన్నారు. ఈ విధానాలలో ప్రయివేటుగా స్వార్థమనేది లేదని ఆయన చెప్పడం లేదు. బలం కలిగిన సాంఘిక శక్తుల ఒత్తిడి లేకుండా వానిని అనుసరించారనడం లేదు. ఇవన్నీ జయం పొందినవని కూడా చెప్పలేదు. కాగా ప్రయివేటు వ్యాపార వర్గాలు సాంఘికంగా

తమకు గల బాధ్యతలను నిర్వహించడానికి చిత్త శుద్ధితో ప్రయత్నిస్తున్నారనడానికి వానిని నిదర్శనంగా మాత్రమే చూపుతున్నాడు. ఆయన ఇచ్చిన (చిన్న అక్షరాలలో వున్న) నిదర్శనాల జాబితా ఇది. ఇందులో మిశ్రమమైన మూలపు ఉద్దేశ్యాలు అనేకం వున్నా, ఈ జాబితా చాలా ముచ్చటగా వుంది.

అమెరికా వర్తక, వాణిజ్య వర్గాలు మొత్తంగా యుద్ధం రక్షణ శాఖకు కావలసిన ఉత్పత్తిలో ప్రభుత్వంతో సహకరించినట్టు సూచించే మహత్తరమైన ఆధారాలు వున్నాయి.

ఈ కాలంలో వాణిజ్య వర్గాలు విపరీతంగా లాభం తీయడాన్ని ఎవ్వరూ నిరాకరించడం లేదు. కాని వీరు ఎంతగానో చిక్కులు పొందుతూ, కేవలం ప్రజలపట్ల తమకొక బాధ్యత కలదనే అభిమానంతో నిర్వహించిన బాధ్యతలు, సమకూర్చిన కార్యవర్గపు అనుభవాలు అశేషంగా వున్నాయి.

యుద్ధానంతరం యేర్పడిన ద్రవ్యోల్బణ కాలంలో అనేక కంపెనీలు కావాలని తమ ధరలను మార్కెట్‌లో వానికి వున్న స్థాయికంటె తక్కువగా నిలబెట్టాయి. మరికొన్ని తమ ధరలను తగ్గింపు చేశాయి కూడా.

ఈ విషయంలో ప్రొఫెసర్ బోలెన్ ఉదారంగా చెప్పారు. వర్తక వాణిజ్య వర్గాలలో ఇంకా

హెచ్చుమంది తమ ధరలను తగ్గించి, ద్రవ్యోల్బణానికి వ్యతిరేకంగా ఇంకా గట్టిగా పోరాడి వున్నట్టయితే, మన ఆర్థిక వ్యవస్థ ఈనాడు మరింత సౌష్ఠవంగా వుండేది.

అనేక వ్యాపార సంస్థలు తమ వ్యాపారపు అలవాట్లను మెరుగు పరచదగిన నైతిక నియమావళిని సిద్ధపరచుకున్నాయి. అనేక సంవత్సరాలుగా యీ నియమావళులను అభివృద్ధి చేసుకొని, బలపరుచుకొన్నాయి కూడా.

వస్తువులలో కల్తీలు, నకిలీ వ్యవహారాలు, తక్కువ కొలతలు అలాంటి దురలవాట్లను చాలవరకు అధిగమించాయి. ఈ విషయంలో బ్యూరోలు, ఛాంబర్స్, ఐచ్ఛికంగా యేర్పడిన అలాంటి సంస్థలు అనేకం ఈ కృషిని కొనసాగించాయి.

వ్యక్తిగతంగా అనేక కంపెనీలు, పని పరిస్థితులను మెరుగు పరచడానికి, పని గంటలు తగ్గింపజేయడానికి, సెలవులు ఇవ్వడానికి, ముసలితనం, వ్యాధులవల్ల బాధలు, నిరుద్యోగం వగైరాల బాధలనుంచి కార్మికులకు మరింతగాలి విముక్తిని కలిగించి భద్రత సమకూర్చడానికి పట్టుదలతో కృషి చేశాయి.

కార్మిక సంఘాలు గుర్తించబడినాయి. కార్మికులు సంఘంగా సంఘటితపడి, సమష్టిగా కోర్కెలు సాధించుకొనడానికి గల హక్కు సర్వత్రా ఆమోదించబడింది.

అయితే ఇక్కడ కూడా ప్రొఫెసర్ బోలెన్ ఉదారంగా వున్నారని నేను భావిస్తున్నాను, ఈ విషయంలో వర్తక వాణిజ్య వర్గాలకు ప్రత్యే

మ్నాయమైన మార్గం మరొకటి లేదు. కాని ఫలి తాన్ని గురించి వివాదానికి ఆస్కారం లేదు.

వ్యక్తిగతంగా అనేక కంపెనీలు, మానవులుగా కార్మి కులు ఎదుర్కొనే సమస్యల పట్ల హెచ్చు శ్రద్ధ చూపు తున్నాయి. వారిని మానవులుగా పరిగణించి, గౌరవించి, హుందాతనంతో చూస్తున్నవి. వ్యాపారానికి సంబంధించిన విషయాలలో వారిని సంప్రదిస్తున్నవి కూడా.

ఇరవయ్యో శతాబ్దపు పారిశ్రామిక సంప్రదా యంలో ఇదే, తాము చేస్తున్న దేమిటో కార్మికులు అర్థంచేసుకొని, తమను ప్రధానంగా మేనేజిమెంటులు గుర్తిస్తున్నవనే భావం కార్మికులకు కలిగిన సందర్భా లలో, ఉత్పాదక శక్తి హెచ్చుతున్నదనేది పరిశీలన మీాద కానరావడం, ప్రధానమైన విశేషంగా వుందని నేను అనేక దఫాలు ఇదివరకే చెప్పివున్నాను. హార్వర్డ్ బిజినెస్ స్కూలుకు చెందిన కీర్తిశేషుడు డాక్టర్ ఈల్టన్ మేయో జరిపిన పరిశోధనలవల్ల కూడా తక్కువపని గంటలు, విశ్రాంతికి హెచ్చు వ్యవధి వగైరాలవల్ల కాక కార్మికుల మంచి చెడ్డ లను గురించిన యోచన కలదని,వారినికూడా ప్రధా నంగా పరిగణిస్తారనే వాతావరణం వున్నప్పుడే, కార్మికులలో ఉత్పాదక శక్తి హెచ్చుగా వుంటున్న దని తెలియవచ్చింది. ఇందుకు సంబంధించిన పరిశో

ధనల శాస్త్రం యింకా శైశవావస్థలో వున్నప్పటికీ, దీనికి మంచి భవిష్యత్తు కలదనేది ధృవపడుతూన్నది.

కొన్ని కంపెనీలలో జాతి, మత, లింగ విచక్షణతో కార్మికులను చూడడమనేది తగ్గిపోయింది.

వ్యాపార రహస్యమనేదానికి స్వస్తి చెప్పి, కంపెనీలకు సంబంధించిన పూర్తి వివరాలను, జమా ఖర్చులను కార్మికులకు, ప్రజలకు వెల్లడించే అలవాటు హెచ్చింది. ఈవిధంగా వున్న విషయాలను నిర్మొహమాటంగా చర్చించుకున్నప్పుడు కార్మికులు, మేనేజిమెంటు కూడా, పరస్పర లాభం కోసం మరింత హెచ్చుగా సహకరించుకొనే అవకాశాలు పెరగ వచ్చు కూడా.

సాంఘిక శ్రేయస్సుకు సంబంధించిన కార్యక్రమాలు, విద్యాభివృద్ధి, సంక్షేమ పథకాలు, వినోద వికాస సౌకర్యాలను వర్తక వాణిజ్య వర్గాలు హెచ్చుగా సమర్థిస్తున్నవి. ఇందుకు యివి యిస్తూ వున్న విరాళాలు దాదాపు అన్నిచోట్ల పెరుగుతున్నాయి.

ప్రకృతి సంపదలను చక్కగా సమీకరించుకొనడం, వానిని వినియోగించుకొనడంలో మేలురకం పద్ధతులను అనుసరించడంలో వర్తక, వాణిజ్య వర్గాలు హెచ్చు శ్రద్ధను చూపుతున్నాయి.

ఇందుకు చక్కని ఉదాహరణ: కలప వినియోగం. నిర్ణీతమైన పథకం ప్రకారం కలప కోసం అడవులను పెంచుతున్నారు. అయితే యింకా చేయ

వలసింది చాలా వుంది. భూసారాన్ని సంరక్షించు కొనవలసిన అవసరాన్ని పెద్ద వ్యావసాయిక సంస్థలు అనేకం గు_ర్తించాయి. కాలిఫోర్నియాలో నీటి సప్లయిలో లోటు వస్తున్న ఫలితంగా, అందు బాటులో వున్న నీటిని సద్వినియోగం చేసుకొనే పద్ధతులను అనుసరిస్తున్నారు.

కొన్ని కంపెనీలు, కొత్తగా ఫ్యాక్టరీలను నెలకొల్పడంలో పాత ఫ్యాక్టరీలను వదిలిపెట్టడంలోను కూడా ఆయాప్రాంతాల సమాజిక ప్రభావాలను గమనిస్తున్నవి.

అవి ఇలా తప్పక గమనించి తీరాలి. న్యూ ఇంగ్లండులోని ఒక పెద్ద కంపెనీ సంగతి నాకు తెలుసు. అది తన పాత సిబ్బందిని వదులుకొని దక్షిణాదికి వెళ్లినప్పుడు, పెన్షనుల రీత్యా వారికి సొమ్ము చెల్లించవలసిన భారం దానికి తగ్గుతుంది. అయినా అలా చేయడానికి అది అంగీకరించలేదు. సాంఘిక చైతన్యాన్ని, సాంఘిక బాధ్యతను విస్మరించి అలా చేయడం దానికి యిష్టం లేకపోయింది.

పనిపాటులు లభించడంలోను, ఉత్పత్తి క్రమంలోను ఋతువుల రీత్యాను, తదితర కారణాలవల్లను వచ్చే చిక్కులను తొలగించడానికి నిర్ణీతమైన, నిర్మాణాత్మకమైన ప్రయత్నాలు జరిగాయి. కొన్ని కంపెనీలు సాలుసరి వేతనాలకు లేదా సాలు పొడుగునా పనులు చూపడానికి పూచీ ఇచ్చాయి.

ఇలా సాలుసరి వేతనం పొందడమనేది అన్ని పరిశ్రమలకు సంభవం కాదు. దీని కోసం ఒత్తిడి చేయడం వల్ల, పరిశ్రమలకు మోయరాని భారం వల్ల లాభాల కంటె నష్టాలే ఎక్కువగా కలగ వచ్చు.

అనేక కంపెనీలు స్పెక్యులేషన్ వ్యవహారాలను విరమించాయి. ఇప్పటి ఫ్యాక్టరీలను వాని పరికరాలను సముచితమైన స్థితిలో వుంచడానికి కొత్త ఫ్యాక్టరీలను, వానికి తగిన పరికరాలను నెలకొల్పడానికి అవసరమైన పెట్టుబడి నిష్పత్తులను సముచితరీతిని మార్పు చేయడానికి ప్రధానమైన కృషి జరుగుతున్నది. వాడకందారులకు పరపతి సౌకర్యాలు, భీమా వసతి, తనఖాలమీద అప్పులు వగైరాలలో వ్యాపారపు అలవాట్లు మెరుగు పరచబడినవి. బాండుల రూపంలో నిధుల వసూలు, కొత్త కంపెనీల నిర్మాణంలో కూడా వ్యాపారపద్ధతులలో చక్కని మార్పులు వచ్చాయి. ఐచ్ఛికంగా పరపతులను కంట్రోలు చేసుకొనడంలో కమ్మర్షియల్ బ్యాంకులు సహాకరించాయి. కేవలం విజ్ఞానం కోసం పరిశోధనలు జరపడాన్ని, దర్యాప్తులు చేయడాన్ని వర్తకవాణిజ్యవర్గాలు పూర్తిగా ప్రోత్సహించాయి.

ఇక్కడితో ప్రొఫెసర్ బోలెన్ యిచ్చిన జాబితా సమాప్తమై పోయింది. బహుశా యితర ఆర్థికవేత్తలు లేదా, వణిక్ప్రముఖులు కూడా తమ జాబితాలను యిలాగే తయారుచేసుకోవచ్చు. ఏమై

నప్పటికి అన్నింటా ప్రముఖంగా కానవచ్చేది ధర్మ కర్తృత్వభావం. ఇక్కడికి వచ్చిన అనేకమంది యూరోపియన్ పరిశీలకులతో పరిచయంవున్న ఒక రచయిత,ఆ పరిశీలకులకుయిక్కడ (1) మేనేజిమెంటు అనేది సాంఘికమైన బాధ్యతగా రూపొందడం (2) కేవలం కాయకష్టం చేయగలవారి స్థానే మానసికంగా సుశిక్షితులైన వారిని నియమించుకోవడం (3) యజమాని అనేవాడు దాదాపు నామరూపాలు లేకుండా పోవడమనేది ఆశ్చర్యాన్ని కలిగించిందని చెప్పాడు. ఇదికూడా గమనీయమైన జాబితాగానే వుంది.

అమెరికా పారిశ్రామికులకు, వర్తక వాణిజ్య వర్గాలకు సాంఘిక బాధ్యత అనేది ఎంతవరకు ఒక జీవిత విధానం ఎలా అయినదో గమనించడానికి మరొకమార్గం వుంది. అసలు మంచి కార్పొరేషన్ లేదా,మంచి కార్య నిర్వాహకుడు అనడానికి వాణిజ్య వర్గాలు పెట్టుకున్న కొలబద్ద ఏమిటి?

"అతను మంచి పని చేస్తున్నాడు" అని ఎవ్వరైనా ఏ సందర్భంలో అనుకుంటారో, తమ స్థానిక సమాజంలోనే ఏ విమర్శకుడైనా లేదా వ్యాపారైనా పరిశీలించి తెలుసుకోవచ్చు కూడా.

ఈ ప్రశ్నకు సంబంధించిన సమాధానంలో ఒక

వ్యక్తి లేదా అతనికి చెందిన కంపెనీ ఎంత లాభం తీస్తున్నదనేది అంతిమ విషయంగా వుంటుందని నేను నమ్ముతున్నాను. కొన్ని సందర్భాలలో అతను తీసిన లాభాలు విమర్శలకు గురి కావచ్చును కూడా. ప్రధానంగా పరిగణించే విషయాలు ఇంకా వుండవచ్చు. అలాంటి వన్నీ ప్రొఫెసర్ బోలెన్ వచ్చిన జాతిలో చేరివున్నట్టివే. ఒక వ్యక్తి లేదా అతని కంపెనీ బాగా పని చేస్తున్నదని అతని సహచరులు చెప్పుకొనడానికి వున్న పరీక్షా పత్రంలో కింద వివరించిన ప్రశ్నలు కొన్ని వుంటాయి.

(1) ప్రవేశపెట్టిన కొత్త భావాలు, కొత్త పద్ధతులు, కొత్త వస్తువులు (2) వస్తువుల నాణ్యం (3) సాఫీగా నడిచిపోయే సంస్థ (4) పెరిగిన, మెరుగుపడిన సౌకర్యాలు, పనులు, ఉత్పత్తి (5) పొందిన సుస్థిరత్వం, భద్రత, అభివృద్ధి (6) పెంపొందిన ప్రజా సంక్షేమం, కార్మిక సంక్షేమం (7) పొందిన ప్రసిద్ధి (8) తీసిన సంతృప్తికరమైన లాభం.

ఇందులో సంతృప్తికరమైన లాభం అనే దానిని ఈ జాబితాలో చివరను చేర్చడం దాని ప్రాధా

న్యాన్ని తక్కువగా అంచనా వేయడం కాదు. వ్యాపారాన్ని నడిపే కార్యనిర్వాహకుని ప్రాథమిక మైన బాధ్యత వ్యాపారాన్ని జయప్రదంగా నడపడమే కావచ్చు. అందులో కూడా కొంత లాభం తీయడ మనేది తప్పనిసరి. కాని జయం పొందడ మనేది లాభం తీయడం కంటె విశాలమైనది. ఇలా లాభ దృష్టి అనేది సమన్వయంగా వున్న మూల భావాల లోను, ధర్మ కర్తృత్వ వ్యవస్థలోను సముచితమైన స్థానాన్ని మాత్రమే ఆక్రమించి వుంటుంది.

ఈ పరిస్థితిని అతిగా చిత్రించవలసిన అవసరం లేదు. సాంఘిక బాధ్యత అనేది పెరిగి నప్పటికి, ఇంకా పయనించవలసిన దూరం చాలా వుంది. కాని ఇందుకు సంబంధించిన చైతన్యం సర్వాం తర్యాలుగా వుంది. ఈనాటి లేదా, రేపటి మహత్తర సమస్య సాంఘికమైనది.అది జాతిలోనిదే అయి వుండ వచ్చు లేదా, ప్రపంచ ప్రజలకు సంబంధించినది కావచ్చు. ఫ్యాక్టరీది కావచ్చు. పట్టణానిది కావచ్చు.మెకానిజం, టెక్నాలజీ, డబ్బు, భౌతికమైన

లాభాలు వగైరాల కంటె ప్రజలు ఎలా నివశిస్తు న్నారు, కలిసి మెలిసి ఎలా పనిచేస్తున్నారనేది అర్థం చేసుకోనడంలోనే అత్యధిక ప్రాధాన్యం వుంది. పరస్పర బంధుత్వం. అంతా కలిసి వున్నామనే భావం, సాంఘిక బాధ్యత కీలకంగా వున్నాయి. ఇలా యిది మానవజాతి నమ్మకాలు, మత సంబంధమైన సంప్రదాయాలనుంచి ఉద్భవించిన ఆధ్యాత్మిక సిద్ధాంతం అవుతున్నది.

# 11

మనకు 'వ్యాపారుల ప్రభుత్వం' కాబోలు వున్నదని అంటూ వుంటారు. ఇలా అనడమైతే అంటారు కాని, ప్రభుత్వానికి వ్యాపారులకు మధ్య సంబంధాలు పూర్తిగా స్థిరపడినవని చెప్పే వారొక్కరూ లేరు. ఇలా ఏర్పడిన సంబంధాలలోనే, అమెరికా ఆర్థిక వ్యవస్థలో సమన్వయం నెలకొనడానికి సహాయపడిన శక్తులు అనేకం గర్భితమై వున్నాయి. ఈ సమన్వయాన్ని సరిదిద్దడానికి 1930 లో ప్రభుత్వం తానుగా హెచ్చు కృషి చేసింది, అయితే

ప్రభుత్వం ఎక్కువగా అధికారాలు చెలాయించిన ఉదాహరణలు లేక పోలేదు.

ఈ పుస్తకంలోని విషయాలను ముందుగా వార్తా పత్రికలలో వ్యాసాల రూపంలో ప్రకటించినప్పుడు, గత రెండు దశాబ్దాలలోను వ్యాపారులు సాధించిన పెక్కు విజయాలలో ప్రభుత్వానికి కూడా పాలు కలదని తొలి వ్యాసంలోనే చెప్పనందుకు, నిరసన తెలియజేస్తూ పెక్కు లేఖలు నాకు వచ్చాయి. అందులో ముఖ్యమైన లేఖలు రెండు హార్వర్డ్ విద్యాకేంద్రంలోని చరిత్రకారుడు ప్రొఫెసర్ ఆర్థర్ స్కీల్ షింగర్ (జూనియర్) నుంచి ఒకటి, ఆర్థికశాస్త్రవేత్త ప్రొఫెసర్ సేమోర్ ఇ. హారిస్ నుంచి ఒకటి వచ్చాయి. ప్రభుత్వం, వ్యాపారుల పరస్పర సంబంధాలు, వాని ఫలితాలను గురించి ముందు ముందు వ్యాసాలలో చర్చించగలనని వారికి నేనప్పుడు వివరించి వున్నాను.

వారి విమర్శలకు మూలాధారాలు రెండు. ఆర్థిక మాంద్యం సంభవించినప్పుడు సహాయపడడానికి

వ్యాపార వర్గాలు తామంగా చేయగల సహాయాన్ని నేను అతిగా అంచనా వేయడం; కేపిటలిజమనేది పరస్పరం సహాయం చేసుకొనే దశకు రావడంలో ప్రభుత్వంచేసిన కృషిని నేను తక్కువగా అంచనా వేయడం. ప్రొఫెసర్ స్కిల్ షింగర్ తన వాదనను ఘాటుగానే యిలా విశదం చేశారు. "1920 కి 1930 ఆరంభంలోను మనం ఆర్థికంగా అనుభవించిన బాధలకు, ప్రస్తుతం అనుభవిస్తున్న ఆరోగ్యానికి ప్రధాన కారణమేమిటి? మన ఆర్థిక వ్యవస్థను క్రమబద్ధం చేయడంలోను, మార్గదర్శకంగా వుండడంలోను ప్రభుత్వం విధ్యుక్తంగా నిర్వహించవలసిన పాత్రను నిర్వహిస్తూ వున్నదనడం సుస్పష్టం. ఇప్పుడు డెమొక్రాటిక్ పార్టీ అధికారంలో లేదు కనక, మన ఆర్థిక వ్యవస్థకు సుస్థిరమైన పునాదులు పడి, యిప్పటి మన ఆర్థికాభ్యున్నతి సుసాధ్యం కావడం 'న్యూడీల్' విధానంవల్ల సంభవించిందని ప్రజలు ఉదాత్తంగా ఎందుకు అంగీకరించకూడదు?"

ప్రొఫెసర్ హారిస్ కూడా ప్రభుత్వానికి యిలా ప్రాధాన్యం యిస్తున్నాడు. "మన ఆర్థిక

వ్యవస్థ పొందిన పతనావస్థ నుంచి, దానిని బయటికి తీసినది ప్రభుత్వం. ఇందుకు సంబంధించిన చిక్కులనుంచి బయటపడడం ప్రభుత్వపు నాయకత్వం లేకుండా సాధ్యపడదు. అలాంటిది ఆచరణ సాధ్యంకాదు గూడా. ఈ పనిని వ్యాపారులు చేయలేరు.అలా చేయగల శక్తి ఏనాడూ వారికి వుండదు."

అయితే ఈనాటి పరిస్థితులకు మూలకారణం ప్రభుత్వం కాదని, ప్రభుత్వపు విధ్యుక్త ధర్మం మన ఆర్థిక వ్యవస్థను 'క్రమబద్ధంచేసి, మార్గ దర్శకంగా' వుండడం కాదని యింత గట్టిగానూ వాదించగల చరిత్రకారులు, ఆర్థిక శాస్త్రవేత్తలు లేకపోలేదు. అయితేదీనినిగురించి వాదానికి అవకాశం ఎంతమాత్రం లేదు. 1930 లో ప్రజల కొనుగోలు శక్తిని పెంచడం లోను, ఆదాయాల పంపిణీలోను, కార్మిక సంఘాల శక్తిని పెంచడంలోను, పటుత్వం కలిగిన ఆంక్షలను ప్రవేశపెట్టడంలోను ప్రభుత్వం ప్రధానమైన పాత్రను నిర్వహించిన మాట నిజం. ప్రభుత్వం జాతీయ రక్షణ ఏర్పాట్లక్రింద చేస్తున్న ఖర్చులు నేటి మన ఆర్థిక వ్యవస్థకు హెచ్చుగా జీవం పోస్తున్న మాటా

నిజమే. సమ్యక్ దృక్పథం కలిగిన పరిశీలకు లెవ్వరూ ఈనాడు 'న్యూ డీల్' ద్వారా జరిగిన సంస్కరణలను కాదనరు. అయితే వానిని ప్రభుత్వం ఎలా అమలు జరిపిందనే దానిమీదనే అనేక విషయాలు ఆధారపడి వున్నాయి.

ఇంతకీ ప్రొఫెసర్ స్కాల్ షింగర్ చెప్పినట్లు, మన ఆర్థిక వ్యవస్థకు ప్రభుత్వం 'మార్గ దర్శకంగాను, క్రమ బద్ధం చేసేదిగాను' వుంటున్నదా? దానికి సమాధానం ఈ మాటలకు గల అర్థాల మీద హెచ్చుగా ఆధారపడి వుంటుంది. అయితే ప్రభుత్వానికి అంతర్గతమైన శక్తులను సమపాళ్ళలో వుంచగల శక్తి మాత్రం వుంది.

అధికార మనేది సమపాళ్ళలో వుండాలని' ప్రభుత్వ మనేది సహాయ పడగలదనేది అమెరికా చరిత్రలోను, సంప్రదాయంలోను, రాజకీయ చతురతతో కూడిన యోచనా ధోరణిలోను అంతర్గతంగా కలదన్న విషయం నిరూపించడానికి అమెరికన్లలో విభిన్న రంగాలకు చెందిన ముగ్గురు పెద్దలు–థామస్ జెఫ్ఫర్సన్, డేనియల్ వెబ్స్టర్,

ఇల్లిరియాట్ చెప్పిన కింది విషయాలను ఉదాహరిస్తే సరిపోతుంది.

థామస్ జెఫ్ఫర్సన్ 1813 లో జాన్ ఆడమ్స్‌కు వ్రాసిన లేఖలో యిలా అన్నాడు:

"ఇక్కడ ప్రతి ఒక్కరికి వారు కోరుకుంటే తమకు తాముగా పని చేసుకొనడానికి తగిన భూవసతిని కలిగి వుండవచ్చు. లేదా ఏదైనా పరిశ్రమపట్ల మక్కువవుంటే దానికోసమని కార్మికుల నిత్య జీవనోపాధికి మాత్రమే కాక, ముసలితనంలో శ్రమించ లేనప్పుడు అవసరమైన దానికి కూడా ప్రతిఫలాన్ని దానినుంచి తీయవచ్చు. ప్రతి ఒక్కరు తమకుగల ఆస్తి ద్వారాను లేదా, తాము వుంటున్న సంతృప్తికరమైన పరిస్థితుల వల్లను, శాంతి భద్రతలను కోరుతూ వుంటారు. ఇలాంటివారు తమకు సంబంధించిన వ్యవహారాలమీద అవసరమైన అజ్మాయిషీని, కొంత స్వాతంత్ర్యాన్ని సురక్షితంగాను, లాభదాయకంగాను తమ కిందనే వుంచుకొనవచ్చు. ఇలాంటిది యూరపియన్ నగరాలలో కొందరి కింద

వున్నప్పుడు, వారు వానిని వినియోగించుకొని పబ్లిక్, ప్రయివేటు అనే విచక్షణ లేకుండా విధ్వంసం చేశారు."

డేనియల్ వెబ్ స్టర్, 1820 లో ప్లిమత్ రాక్ లో ప్రసంగిస్తూ యిలా అన్నాడు:—

"స్వేచ్ఛ కల ప్రజా ప్రభుత్వానికి నిజమైన మూల సూత్రం, దానిని భద్రపరచడంలో అందరికీ లేదా, హెచ్చు మందికి తగినంత శ్రద్ధ వుండేటట్టుగా, దానిని నిర్మించడంలోనే వున్నట్టు కనిపిస్తుంది. స్వేచ్ఛ కలిగిన ప్రభుత్వం మనగలిగినప్పుడు, దాని శాసనాల ధోరణి కొందరి చేతులలో ఆస్తులు త్వరితంగా పేరుకొని పోయేటట్టుగాను, అశేషమైన ప్రజానీకం చేతిలో దమ్మిడీ లేకుండా ఇతరుల మీద ఆధారపడేదిగాను చేస్తుంది. అలాంటి ప్రభుత్వం చిరకాలం అందరి ఆమోదాన్ని పొందలేదు. అలాంటి సందర్భంలో ప్రభుత్వాధికారమనేది, ఆస్తి హక్కుల విషయంలో విచ్ఛిన్నం కావడమో లేక ఆస్తి గల వారి పలుకుబడితో ప్రజల వోటింగ్

హక్కును పరిమితం చేయడమో, కంట్రోలు చేయడమో జరుగుతుంది. వయోజన ఓటింగ్ హక్కు అనేది, ఆస్తులలో విపరీతమైన అసమత్వాలు వున్న సమాజంలో చిరకాలం చెలాయింపులో వుండలేదు."

1914 సంవత్సరానికి పూర్వమే ఇల్బ్రిహూట్ ఇలా అన్నారు:

"వ్యక్తులు స్వేచ్ఛగా ఇచ్చి పుచ్చుకునే కంట్రాక్టుల స్థానే, ఆర్గనైజేషనులకు గల మహత్తర శక్తికి విశేషమైన పెట్టుబడులు జతపడి, పెద్ద పెద్ద పారిశ్రామిక సంస్థలు నెలకొని, లెక్కలేనన్ని వాణిజ్య సంఘాల ద్వారా పనిచేస్తూ, ఉత్పత్తిలోను, రవాణాలోను, వ్యాపారంలోను కూడా పెక్కుమందిని అటూ ఇటూ కదిపిస్తున్నవి. ఇలా కదిలేవారి సంఖ్య విపరీతంగా వుండడంతో, అందులోని ప్రతి ఒక్కరు ఎవరికి వారు నిస్సహాయులైపోయారు. యజమానికి-సిబ్బందికి, కేంద్రీకరించబడిన పెట్టుబడులకు, సుసంఘటితులైన కార్మికులకు, చిన్న ఉత్పత్తి

దారుకు, చిన్న వ్యాపారికీ, చిన్న వాడకం దారుకీ పెద్ద పెద్ద ఉత్పత్తి రవాణా, పంపిణీ సంస్థలకు మధ్య సంబంధాల పరిష్కారానికి కొత్త సమస్యలు ఏర్పడినాయి. ఇందుకు వ్యక్తులు స్వేచ్ఛగా వ్యవహరించుకొనడమనే పూర్వకాలపు సూత్రం పనికి రానిదైపోయింది. ఇలాంటి కొత్త పరిస్థితులు ఏర్పడక పూర్వం, వ్యక్తులు తమ స్వశక్తి ద్వారా ఎలాంటి న్యాయాన్ని, హక్కులను పొందగలిగారో, అలాంటి వానినే ఇప్పుడు కూడా కలిగించడానికి అనేక విధాలుగా ప్రభుత్వపు జోక్యం అవసర మౌతున్నది.

ఇలా సమన్వయం వున్న ఆర్థిక వ్యవస్థనుగురించి ప్రస్తుతం సాగుతున్న చర్చలకు సంబంధించిన ఉత్తమ గ్రంథంగా, ప్రొఫెసర్ కెన్నెత్ సి. గాల్‌బ్రైత్ రచించిన 'ది డాక్ట్రిన్ ఆఫ్ కౌంటర్ వైలింగ్ పవర్'ను బహుశా పేర్కొనవచ్చు. ఆయన చెబుతాడు: "నిజమైన ప్రమాదం మార్కెట్ శక్తిలో-పారిశ్రామికులు, కార్మికులు కూడా మామూలుకంటె, సమర్థనీయమైన దానికంటె హెచ్చుగా లాభాలను, వేతనాలను తీయ

డంలో కల''దని దీనినే గుత్తాధికారమని ఆర్థిక శాస్త్ర వేత్తలు చెబుతారు. ప్రజలుగూడా సహజంగా దీనిని గురించే ఆందోళన చెందుతూ వుంటారు. 'ప్రతీఘాతకశక్తి'ని బలపరచడమే ప్రభుత్వపు ధర్మమని ప్రొఫెసర్ గాల్‌బ్రైత్ చెబుతాడు. ట్రస్టులకు వ్యతిరేకంగా చేసిన శాసనాలకింద ప్రభుత్వం తీసుకున్న కొన్ని చర్యలు 'ప్రతీఘాతక శక్తి'ని పెంచకపోగా, దానికి అడ్డువచ్చినవని వాది స్తాడు. ఇలా అట్లాంటిక్ అండ్ పసిఫిక్ టీ కంపెనీ వంటి పెద్ద వ్యాపార సంస్థమీద ప్రభుత్వం తీసుకున్న చర్య ఉత్పత్తిదారులకు సహజంగావున్న మార్కెట్ శక్తిని బలపరచవచ్చు. కాని వాడకందారులకు, ప్రజలకు సేవచేస్తున్న డిస్ట్రిబ్యూటర్ల ప్రతీఘాతక శక్తి దీనివల్ల బలహీనపడింది. ఇలాంటి వాటన్నిటిని గురించి తప్పనిసరి నిబంధనలనేవి లేవు. కొన్ని సంద ర్భాలలో ఈ టీ కంపెనీవంటి పెద్ద వ్యాపార సంస్థల వల్ల వాడకందారుకు లాభించవచ్చు. కొన్ని సంద ర్భాలలో యిలాంటి పెద్ద వ్యాపారులు, పెద్ద పారి శ్రామికులతో చేతులు కలిపి మార్కెట్‌నుంచి

అదనపు లాభాలు రాబట్ట వచ్చు. ఏమైనప్పటికీ 1953 లో ప్రొఫెసర్ ఎడ్వర్డ్ ఎస్. మేసన్ 'ఏల్ రివ్యూ' పత్రికలో వ్రాసినట్టు, ట్రస్టులకు వ్యతిరేకంగా వున్న శాసనాలతో కాక, వానిని అవివేకంతో అమలు జరపడంలోనే నిజమైన ప్రమాదం వుంది. 'పెద్ద తరహా' సంస్థలను సమర్థిస్తూ వస్తున్న వాదనలలో పెక్కు లోపాలు వుంటున్నాయి కూడా.

# 12

అధికంగా వుండే మార్కెట్ శక్తిని, ప్రయివేటు వ్యాపారంలో అంతర్గతంగా వుండే ప్రతిఘాతక శక్తితోనే కొంతవరకు ఎదుర్కొన వచ్చుననే వాదనను స్థూలంగా, మొత్తం మీద అందరూ అమోదించారు. ఈ ప్రతిఘాతకశక్తిలో ముఖ్యంగా సుసంఘటితులైన కార్మికులు తీసుకొనగల చర్యలు కూడా చేరి వున్నాయి. అయితే మరింతగా సమన్వయ సాధనకుగాను ప్రభుత్వం సహాయం చేయవలసిన అవసరమనేది బహుశా ఎల్లప్పుడూ

వుంటుంది. చారిత్రికంగా చూస్తే ప్రభుత్వం కూడా అప్పుడప్పుడు దాదాపు హెచ్చుగానే అటూ ఇటూ మొగ్గు చూపుతూ వుండగలదనడం కూడా నిస్సందేహమే.

19 వ శతాబ్దపు చివరను, 20 వ శతాబ్దపు ఆరంభ దశలోను కూడా ప్రయివేటు పారిశ్రామికులు చిత్తం వచ్చినట్టు వ్యవహరించడానికి పూర్తి అవకాశాన్ని ప్రభుత్వం యిచ్చివున్నది. దీనితో అధికార దుర్వినియోగం జరిగింది. అయితే జాతీయ వ్యవస్థ అభివృద్ధి చెందుతూ వున్నప్పుడు, ఆరంభ దశలో ఇలా కాస్త మొగ్గు చూపడమనేది కొంత వరకు తప్పనిసరి కాగలదు కూడా. ఇక 1930 లో ప్రభుత్వం వ్యతిరేక దశలో చాలా హెచ్చు మొగ్గు చూపిన మాట నిజం. (1) కార్మిక రంగం నుంచి ప్రతిఘాతక శక్తి పెంపొందడానికి అది సహాయ పడింది. (2) భారీ సంస్థలనే వానిని వాటి భారీ తనానికిగాను కొంతవరకు ప్రాసిక్యూట్ చేసింది. (3) అనేక కంట్రోల్సును, ప్రయోగాలను అతిగా ప్రవేశ పెట్టింది. సమన్వయ సాధనకు ఉద్దేశించినా,

వీని వల్ల ప్రమాదాలు, చిక్కులు హెచ్చుగా కలిగాయి.

ఇలా అధికంగా జరిగిన వ్యవహారాలు కొన్ని, ప్రభుత్వాధికారాలు అంటే అమితమైన ఇష్టంతో వున్న వ్యక్తుల ద్వారా సాగాయి. ఇలాంటి వారిలో కొందరికి సోషలిస్టు భావ ధోరణి వుంది. ఇందులో విచ్ఛిన్న ధోరణి వున్న కొందరు ప్రభుత్వ యంత్రంలో అక్కడా ఇక్కడా చెదురుగా వుండి, అవకాశం వున్న మేరకు ప్రమాదం తెచ్చి పెడు తున్నారు. వారి పలుకుబడి ముఖ్యమైనదని చెప్ప డానికి సాక్ష్యం లేదు కాని, అది అల్లరితనంగా వుందన్నమాట నిజం. అది కొన్ని కార్మిక సంఘాల వ్యవహారాలలో వలెనే,యిక్కడ ప్రభుత్వ వ్యవహారా లను కూడా విషపూరితం చేసింది.అయితే యిప్పుడు యిలాంటి వారందరూ ప్రభుత్వం నుంచి, కార్మిక సంఘాలనుంచి గెంటివేయబడ్డారు. ఈనాడు నిజ మైన అభ్యుదయ వాదులకు, కన్సర్వేటివ్ లకు ఈ రెండు వర్గాలకు మధ్యగా వుంటూవుండే అసంఖ్యాకు

లైన అమెరికనులకు మధ్య చక్కని సంబంధాలు నెలకొన్నవి.

బ్రహ్మాండమైన ప్రభుత్వంలో అతిగా జరిగిన వ్యవహారాలకు ఎవరు ఎంతగా బాధ్యులో అంచనా వేసి చెప్పడం సులభంకాదు. సోషలిస్టు భావ ధోరణి, చాటుమాటు చర్యలకంటె కూడా అధికారవాంఛ, దానిని వినియోగించి చూడాలనే కుతూహలమే అన్నింటికంటె హెచ్చుగా ప్రమాదం కలిగించిందని నా అభిప్రాయం. అయితే వానిని గూడా పెంచి చెప్పకొనరాదు. ఎందుచేతనంటే, ప్రభుత్వం వేసిన పన్నులలో అనేకం అత్యవసరంగా వేసి తీరవలసినవిగాను, ఉచితమైన రీతిని ఉత్సాహంతో నిరంతరం అమలు జరపవలసినవిగాను వుండడమే దీనికి కారణం.

ఈనాడు ప్రభుత్వానికి గల సమన్వయ శక్తిని అణచివేయడానికిగాను పారిశ్రామిక వర్గాలు గూడా తమకుగల ప్రతీఘాతశక్తిని అతిగా వినియోగించడం గూడా సాధ్యపడవచ్చు. ప్రకృతి సంపదలను సమీకరించు కొనడంలోను, వినియోగించుకొనడంలోను ఇందుకు సంబంధించిన మహా ప్రమాదం వున్నట్టు

కనిపిస్తున్నది. 'వ్యాపారుల ప్రభుత్వం' అంటే పెట్రోలియం, విద్యుచ్ఛక్తి, అటవీసంపల దోపిడీకి వ్యతిరేకంగా పెట్టిన రక్షణల నన్నింటిని తొలగించాలని అర్థంకాబోదు. వాడకందారులను దృష్టిలో వుంచుకోనకుండాను, భవిష్యత్తులో అవసరం కాగల సప్లయిలను గురించి యోచించకుండాను, ఈ ప్రకృతి సంపదలను వినియోగించుకోనడంలో వున్న నష్టాన్ని కూడా వ్యాపారవర్గాలు గుర్తించిన నిదర్శనాలు కనిపిస్తున్నాయి.

ఇందులో విద్యుచ్ఛక్తి ఉత్పత్తి, పంపిణీ విషయంలో వాదోపవాదాలు తీవ్రంగా వున్నాయి. మిస్సోరీలోయ సంస్థ లేదా, కొలంబియా లోయ సంస్థవంటి ప్రాంతీయ సంస్థలవల్ల స్వేచ్ఛాయుతమైన వ్యవస్థలో కీలకమైన కంట్రోల్సును కలిగివుండడం కాగలదనే వారికి, ప్రభుత్వాధికారం మాత్రమే వుండితీరాలనే వారికి మధ్య హెచ్చుగా అభిప్రాయ భేదాలు వున్నాయి. ఈ వాగ్యుద్ధం హెచ్చుగానే జరగవచ్చు. చివరకు మనం సహేతుకమైన సమన్వయాన్ని సాధించవచ్చు కూడా. చివరకు ప్రయివేటు

యాజమాన్యం కింద వుండగల ఈ ప్రజోపయోగకర సంస్థలను వాడకందారుల శ్రేయస్సుకు అవసరమైన శ్రద్ధతో అదుపులో వుంచడం కూడా జరుగుతుంది.

మన ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు, పారిశ్రామిక, వ్యాపార వర్గాలు కూడా బ్రహ్మాండమైన మన ప్రభుత్వం సోషలిజంగా రూపొందడాన్ని నివారించ దలుస్తున్నారు. అయితే వ్యాపార వర్గాలు యితరులను ఖండించడానికి ముందు తమకు తాముగా ప్రభుత్వశక్తి బలపడకుండా నివారించడానికి తాము చేయగల కృషినిగురించి ఆలోచించుకోనడం అవసరమని నాకు తోస్తున్నది. అందుకుగాను నేను ఈ కింది సూచనలు చేస్తున్నాను.

(1) తనకు తానుగా ఉత్పాదక శక్తిని, అభివృద్ధిని, సౌష్టవపరచుకొనవచ్చు.

(2) వ్యాపార వర్గాలు తమ సాంఘిక బాధ్యతలను మరింతగా గుర్తించి, యింకా హెచ్చుగా నిర్వహించవచ్చు. ప్రభుత్వం చేయవలసి వచ్చే పనులను అది ఐచ్ఛికమైన ప్రయివేటు ఆర్గనైజేషనుల

ద్వారా హెచ్చుగా కొనసాగించ వచ్చునని అది విశ్వసించవచ్చు.

(3) రాజకీయ పరిణామాలలోకి మరింతగా జొప్పించుకొని పోవడానికి అనువుగా ప్రభుత్వంలో పనికి హెచ్చుగా పారిశ్రామిక, వ్యాపార వర్గాలు సిద్ధపడాలి. దక్షత కలిగిన నిర్వాహకులు ప్రభుత్వానికి హెచ్చుమంది కావాలి. ఈ సమస్యను ప్రభుత్వం లోపలనుంచి పరిష్కరించ వచ్చు కూడా.

చారిత్రకంగా చూస్తే, ప్రభుత్వానికి వ్యాపార వర్గాలకు మధ్య సంబంధాలు చెడుగా వున్నాయి. 19 వ శతాబ్దంలో వ్యాపార వర్గాలు ప్రభుత్వాన్ని కంట్రోలు చేశాయి. కొన్ని సందర్భాలలో అది శాసనాలను చేయించింది. కొన్ని సందర్భాలలో శాసన సభ్యులనే కొనివచ్చింది. కొన్ని సందర్భాలలో పదవులలో వున్న వారిని నవ్వులపాలు చేయడ మనేది ఒక కళగా అభివృద్ధి చేశారు కూడా. ప్రభుత్వాన్ని అంతర్గతంగా మెరుగు పరచాలంటే, అలా చేయడం సముచితం కాదు. ప్రభుత్వ వ్యవస్థ

పెరుగుతున్న కొలదీ, వివేకవంతులైన కార్య నిర్వాహకులు దానికి హెచ్చుగా కావాలి. ప్రభుత్వ సేవకు కొత్త సంప్రదాయాలు ఏర్పడాలి. అవన్నీ స్థానికంగా ప్రారంభం కావాలి కూడా.

ప్రయివేటు జీవితంలో వుంటున్న నాయకులు హెచ్చుమంది ప్రజా జీవితంలో తగిన పాత్రను నిర్వహిస్తూ వున్నప్పుడు, పరస్పరం సుహృద్భావం, గౌరవం తప్పక పెరగ గలవు. దక్షత కలవారి ద్వారా ప్రభుత్వ చైతన్యం విలసితం కాగలదు. వ్యాపార రంగంలో ఉన్నత స్థాయిని వుండే దక్షతకు, నిజాయితీకి అదే జీవిత వృత్తిగా వుంటున్నవారికి కొత్త రకం గౌరవ మర్యాదలు రాగలవు. ప్రభుత్వాన్ని సవాలుచేసే పరిపాలనా సమస్యల పరిష్కారంలో వ్యాపారులు కొత్త రకం పరిగణను పొందగలరు. వ్యాపార వర్గాలు ప్రభుత్వపు కంట్రోలుకు దూరంగా వుండాలంటే, అది ఎన్నడూ ప్రభుత్వం నుంచి ప్రతిఫలాన్ని కోరరాదు. అందులోను ముఖ్యంగా, మామూలు సమయాలలో ప్రయివేటు వర్గాలనుంచి సేకరించుకొన గలిగిన

పెట్టుబడిని ప్రభుత్వంలో పొందరాదు. కొంత సొమ్ము తీసుకొని రక్షణ శాఖకు సంబంధించిన ఉత్పత్తి సౌకర్యాలు యిందులో చేరవు. కాగా, స్వేచ్ఛ కలిగిన వ్యాపార వర్గాలకు స్వేచ్ఛ కలిగిన పెట్టుబడి మాత్రమే కావాలి.

సుంకాలు కూడా, ఒక రకమైన సబ్సిడీ కాగలవు. జాతీయ భద్రత దృష్ట్యాను, లేదా అతిగా వున్న పోటీనుంచి జాతీయ ఆర్థిక వ్యవస్థను రక్షించడానికి అవి అవసరం కావచ్చు. కాని స్వేచ్ఛాయుతమైన ప్రపంచ ఆర్థిక వ్యవస్థ తన పాత్రను సముచితంగా నిర్వహించాలంటే, ప్రత్యేకమైన సుంకాలు, కోటాలు పూర్తిగా వడపోత కావాలి.

ఆర్థిక చక్రం కింది నైపునకు మళ్ళినప్పుడు కాని ప్రభుత్వానికి, వ్యాపార వర్గాలకు మధ్య వున్న సంబంధాలకు నిజమైన పరీక్ష రాదు. వ్యాపార వర్గాలు 'ప్రభుత్వపు జోక్యం అనే నెపం మీద తప్పించుకొనడానికి చూడకుండా' తన బాధ్యతను పూర్తిగా నిర్వహించడానికి సిద్ధపడినప్పుడుగాని, గత మూడు శతాబ్దాలు తగిన గుణపాఠాన్ని నేర్పిన వనేది సుస్పష్టం కాదు.

ప్రభుత్వం కూడా నిర్వహించవలసిన ప్రధాన మైన పాత్రవుంది. పరిహార సంబంధమైన ఖర్చులు యిందులో కీలకంగా వుండగలవు. అయితే వ్యాపార సంస్థలు కూడా తగినంతగా తమ రిజర్వు నిధులను పెంచుకున్నప్పుడు, అంతర్గతంగా అవి కొనసాగించే పరిహార సంబంధమైన ఖర్చులు ప్రభుత్వానికంటె హెచ్చుగా వుండగలవు. వ్యాపార సంస్థలు తమ పరిశోధనలు, హెచ్చుమందికి పనిచూపగల పథకాలు, ప్రత్యేకంగా నిర్వహించే సాంఘిక భద్రతకు చెందిన కార్యక్రమాలు వగైరాలను యితోధికం చేసినప్పుడు ఆర్థికచక్రం అడుగుకు వచ్చినప్పుడు కలిగే దుష్ఫలితాలను చాలవరకు తక్కువ చేయ వచ్చు. ఏమైనప్పటికి, చరిత్ర మొత్తంమీద చూస్తే గతంలోకంటె ఈనాడు ప్రభుత్వానికి, వర్తక వాణిజ్య వర్గాలకు మధ్య సమన్వయ సంబంధాలు సముచితంగా వున్నాయనడం సబబుకాగలదు. అలా చెప్పడం కేవలం ఈనాటి వ్యాపారినిగురించి చెప్పడం కాదు. రెండు దశాబ్దాలుగా సాగుతున్న విప్లవాత్మకమైన అభ్యున్నతి ఈనాటికి ప్రభుత్వం, వ్యాపార వర్గాల నాయకత్వమనే దశను, అవి రెండూ నేర్చు

కున్న అనేక విషయాలనుగురించి చెప్పడం కాగలదు. ఇకముందు రోజుల్లో అవి తమ అనుభవాన్ని వినియోగించడానికి అనువగు తీవ్రమైన సవాలును ఎదురొ్కనగల వనడం నిస్సందేహం.

# 13

స్వాతంత్ర ప్రపంచం అసమగ్రంగా వుంచిన ప్రధానమైన వ్యవహారం ఏది? స్వాతంత్ర్యంలో జయించవలసిన కొత్త సరిహద్దులు ఏమిటి?

తృతీయ ప్రపంచ సంగ్రామాన్ని నివారించడమనేదే అన్ని ప్రాంతాల వారిని ఎదుర్కొంటున్న ప్రధానమైన సవాలై వున్నది. 'యుద్ధాన్ని గెలవడంకంటె ఓడిపోవడమే విచారకరం' అని ప్రెసిడెంట్ ఐసెన్ హోవర్ సూక్తి.

అలాంటప్పుడు నిర్మాణాత్మకమైన శాంతి కార్యక్రమం ఏది కాగలదు?

ముందుగా మిత్రరాజ్య సమితితో ప్రారంభిద్దాం.

ఈ సంస్థ దానిలోని సభ్యుల దృఢసంకల్పాన్ని, విజ్ఞతను మించి వ్యవహరించలేదు. అదొక ఆయుధం మాత్రమే. కమ్యూనిస్టు రాజ్యాలు వున్నందున దానికి కొన్ని అడ్డంకులు కూడా వున్నాయి. ఎప్పుడో ఒకప్పుడు చిత్తశుద్ధితో శాంతిని నెలకొల్పడానికి తగిన సమాలోచనలు కొనసాగించడానికి అది రంగస్థలం కాగలదు కనక. ఆ విధంగా చూస్తే మిత్రరాజ్య సమితివల్ల కూడా ప్రయోజనం లేకపోలేదు. తనలో అంతర్భాలుగా వున్న అనేక సంస్థలద్వారా, మిత్రరాజ్యసమితి సాంఘిక, వ్యావసాయిక రంగాలలోను, తదితర రంగాలలోను ప్రయోజనకరమైన సర్వీసు చేస్తున్నది. ఇలా మిత్రరాజ్య సమితి అనేది ఒకటి లేనప్పుడు మనం దానికి కనిపెట్టవలసి వచ్చేది. శాంతిని నెలకొల్పడం అది యింకా పూర్తిచేయవలసిన బాధ్యతల దృష్ట్యా, మిత్రరాజ్యసమితిని బలపరచడం అవసరమనేది జాతీయ విధానంలోని కింది విషయాలనుబట్టి సుస్పష్టమౌతున్నది.

ఆత్మరక్షణకు అనువుగా సౌష్టవమైన ఏర్పాట్లు చేసుకొనడమనేది యింకా తొలి అవసరంగా వుంద

నడం నిస్సందేహం. యునైటెడ్ స్టేట్స్, దాని మిత్ర రాజ్యాలు కూడా దురాక్రమణను అడ్డుకొనగలిగినంతగా మిలిటరీ శక్తిని కలిగివుండడం అవసరమే. అయితే రక్షణ వ్యవస్థకు కావలసిన ఆయుధాలకు, కేవలం ఆయుధాల తయారీలో వుంటున్న పోటీ కోసం సిద్ధంచేస్తున్న ఆయుధాలకు మధ్య స్పష్టమైన వర్గీకరణ జరగాలి. ఇవి దురాక్రమణకు ఉద్దేశించ లేదని యునైటెడ్ స్టేట్స్, దాని మిత్రరాజ్యాలు కూడా అనుమానానికి అవకాశంలేకుండా నొక్కి-వక్కా-ణించాలి. మరొక దేశాన్ని లేదా ప్రజలను జయించాలని మనం కోరడంలేదు. అవి పాలిస్తున్న ప్రజల అభీష్టానికి విరుద్ధంగా అవి నెలకొల్పబడి వున్న వని తెలిసిన ప్రభుత్వాలను కూడా తల్లక్రిందులు చేయాలనే దీక్ష మనకు లేదు. ఈ దేశాల ప్రజలకు, ఎప్పుడో ఒకప్పుడు తాము వాంఛిస్తున్న ప్రభుత్వాన్ని నెలకొల్పుకొనే అవకాశం రాగలదనే మనం ఆశిస్తున్నాం. అయితే ఆనందం కలిగించే ఆ రోజు ఎప్పుడు, ఎలా వస్తుందో మనకు తెలియదు. ఈలోగా చాలవరకు సహజీవనాన్ని మనం ఆమో

దించడానికి, దానికి కట్టుబడి వుండడానికి సిద్ధంగా వున్నాము.

అయితే ఈ సమస్యలో అమెరికనుల ఆలోచనలు మరింత సుస్పష్టం కావడం అవసరం. చైనాలోని కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని బల ప్రయోగం ద్వారా పతనం చేయాలని మనం పంతం పట్టినామా? పోలెండు, జెకోస్లొవాకియా, హంగరీ, రుమేనియా, అలాంటి తదితర దేశాలు, చివరకు సోవియట్ యూనియన్‌లోని ప్రభుత్వాల పతనానికి కూడా మనం, ఎప్పుడు ఎలా అవకాశం లభిస్తే అలా, వత్తాసును ఇవ్వగలమా? ఈ విషయంలో మనకు కొంత తికమక వుంది. ఈ ప్రభుత్వాలను బలవంతంగా పతనం చేయడాన్ని మన ముఖ్య దీక్షగా పెట్టుకుంటే, నిజమైన సహజీవన మనేది వుండదు. అలాకాక అక్కడ ఆయా పరిస్థితులు తగు రీతిని పరిణామం చెందడానికి వదిలివేస్తే, కమ్యూనిస్టు ప్రభుత్వాలతో మనం తగు ఒడంబడికలకు రావచ్చు. తద్వారా ప్రపంచంలోని ఉద్రిక్తత తగ్గిపోతుంది.

ప్రపంచంలోని రాజకీయ సమస్య లన్నింటిలోను యిదే సున్నితమైన సమస్య.

ఇంతకీ మనం చేయవలసిన దేమిటి? మనం విశ్వసిస్తున్నట్టుగా 'హద్దులలో వుంచే' విధానమా, లేక, విమోచనమా లేక ఈ రెండింటికీ మధ్యస్థమైనది మరొకటా? ట్రూమన్ ప్రభుత్వం 'హద్దులలో వుంచడాన్ని' తన విధానంగా చేసుకున్నది. అడ్లాయ్ స్టీవెన్‌సన్ కూడా ప్రపంచ పర్యటననుంచి తిరిగి వచ్చి సూచించిన 'నిరాక్రమణకు గ్యారెంటీలు' కూడా ఒకరకంగా హద్దులలో వుంచే విధానం ధృవీకరణే కాగలదు. విదేశాంగమంత్రి జాన్ ఫాస్టర్ డల్లెస్ కూడా విమోచనను గురించి ముందు దురుసుగా మాట్లాడినా, ఆ తరువాత తన ధోరణిని మార్చుకొని, వివరణ చేస్తూ, సహజీవనాన్ని ఆమోదించడానికి దాదాపు సగం వరకు సిద్ధమైనాడు.

అమెరికా ప్రజలు ఉద్రేకంతో, హృదయపూర్వకంగా విమోచనకు సముఖంగా వున్నట్టు

నాకు కనిపిస్తున్నది. కాని వారిలో ప్రకృతి సిద్ధంగా దురాక్రమణ వాంఛ లేదు. బలప్రయోగం ద్వారా విమోచనకు వారు విముఖులు. మధ్య యూరపు నుంచి సైబీరియా వరకు వ్యాపించి వున్న ప్రభుత్వాల సంగతి వదిలివేసినా, చైనాలోని కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని విచ్ఛిన్నం చేయడానికి విపరీతంగా చెల్లించవలసిన మూల్యాన్ని, సైనికుల రూపంలోను మందుగుండు సామగ్రి రూపంలోను చెల్లించడానికి ఇష్టపడుతున్నామనే సూచనలు మనలో కానరావడంలేదు.

దీనినే మరొక రకంగా చెప్పవచ్చు. భావ సంఘర్షణకు—స్వాతంత్ర్యం కలిగిన సమాజంలో మానవుని గల హక్కుల ద్వారా వ్యక్తమయ్యే సత్యానికి, పోలీసు ప్రభుత్వపు రూపం పొందిన అసత్యానికి మధ్య సంఘర్షణను—మనం తప్పక కోరుతున్నాము. ఈ భావాలను గురించే పోరాటం జరగాలి. అంతే కాని నియంతృత్వ రాజ్యాలను సైనిక బలంతో అణచివేయాలనే పట్టుదల మనకు లేదు.

చిరకాలంగా మానవ స్వాతంత్ర్యాన్ని మనం కోరుతున్నాం. అటు ఆసియాలో కాని ఇటు యూరపులోగాని, ఎంతగానో రెచ్చగొట్టడం జరిగి నప్పుడే స్వాతంత్ర్యం పక్షాన మనం ప్రధానమైన సైనిక యుద్ధాలలో ప్రవేశించాము. పరిస్థితులు సహజంగా పరిణామం చెందడాన్ని మనం కోరు తున్నామని, మనకు దురాక్రమణ వాంఛ ఎంత మాత్రమూ లేదని కమ్యూనిస్టు దేశాలకు మనం సుస్పష్టం చేయగలగడం మన రాజకీయ చతురతకు మించిన పని కాగలదా? బహుశా తూర్పు యూరపులోని ఇప్పటి సరిహద్దులకు మనం హామీ లను ఇవ్వలేము - ఇవ్వరాదు కూడా. అయితే కమ్యూనిస్టులు దురాక్రమణ యోచనలకు స్వస్తి చెప్పినప్పుడు, వారి వారి సరిహద్దుల లోపలి వారికి తోచిన రీతిని వ్యవహరించుకొనడానికి కావలసినన్ని అవకాశాలు వుండగలవని తెలియ జెప్పగల చర్య, గ్యారెంటీలతో సంబంధం లేనిది, మరొకటి లేదా? విజ్ఞత కలిగిన రాజకీయ నాయకులు, కీర్తి శేషులైన సెనెటర్ ఆర్థర్ హెచ్. వాన్ డెన్ బర్గ్ వంటివారు ఇందుకు సంబంధించిన పవిత్రమైన ప్రకటనలకు

పెక్కు ప్రతిపాదనలుచేసి వున్నారు. ఇలాంటి ప్రకటనలతోపాటు, నచ్చజెప్ప గలిగిన జాతీయ విధానాలు, నిరంతరమైన చర్యలు తీసుకున్నప్పుడు, నిరాయుధీకరణకు అనువైన ఒడంబడిక కుదరడానికి పునాది పడవచ్చు.

ఆయుధ విసర్జనను గురించి ప్రసంగించడం బహుశా వృధాగానమే కావచ్చు. కాని అంతు లేకుండా ఆయుధోత్పత్తి భారంతో ప్రపంచం ఇలా క్రుంగి పోవలసిందేనా? ఇలాంటి మితిమించిన భారాన్ని వహిస్తూ వుండడాన్ని నిరాయుధీకరణకు సంప్రతింపులు జరపడాన్ని కాదనప్పుడు 'నిరోధ యుద్ధం' అనే నిష్ప్రయోజనమైన వాదన మాత్రమే మిగులుతుంది. ద్వితీయ ప్రపంచ యుద్ధం తరువాత కంటె కూడా, తృతీయ ప్రపంచ యుద్ధం తరువాత, అందుకు సంబంధించిన విషాదం, కల్లోలంతో, ప్రపంచ శాంతిని సాధించడం సులభం కాగల దనడం ఎలా సహేతుకం కాగలదు? కనక మనం పూర్తి చేయకుండా వుంచిన 'వ్యాపారంలో'

తగినన్ని రక్షణ బలాలను సృష్టించి, పోషించడ మనేది తొలి అంశం కాగలదు.

తగినన్ని అంటే ఎన్ని? ఆ విషయం అందుకు సంబంధించిన నిపుణులు చెప్పాలి. అయినప్పటికి యుద్ధోత్పత్తిలో, వృధా ఖర్చులను, పాతబడి పోయినవాని ఉత్పత్తిని పూర్తిగా తగ్గించాలన్నది నానాటికి స్పష్ట మౌతున్నది. అందుకు అమెరికా ప్రభుత్వంలోని రక్షణ మంత్రి, ఆయన సహచరులు శ్రద్ధ చూపాలి. రక్షణ శాఖ బడ్జెట్టులో అనవసర మైన భాగాలను కత్తిరించివేయాలి. అందులో వారికి ఇతరుల సహాయం అవసరం. వీరితో కలిసి ఈ విషయంలో వ్యవహరించేవారు సైనిక, వైమానిక, నౌకా శాఖలలోని నిపుణులు,నాయకులు వున్నారు. వారికి వారి వారి శాఖల సేవలను తగ్గింపు చేయడం జరగదని, పైగా పెంచడం జరుగుతుందని కూడా ఈ సందర్భంలో నచ్చ చెప్పవలసి వుంటుంది. వీరిలో చాలా మంది రక్షణ లేనివారికి రక్షకులు వుంటు న్నారు. అందువల్ల మనం చేయవలసిన కృషి చేస్తూ వుండాలి. అనవసరమైన వానిని తగ్గించి

వేయాలి. భవిష్యత్తులో రాగల రక్షణశాఖ అవస రాలను దృష్టిలో వుంచుకొని నిరంతరం పరిశోధనలు, ప్రయోగాలు జరుపుతూ వుండాలని వేరుగా గుర్తు చేయవలసిన అవసరం లేదు.

ఇలా ఒకవైపున రక్షణ బలాలను ఆయత్తం చేసుకుంటూనే, మరొకవైపున సకాలంలో ఇందుకు సంబంధించిన ఖర్చుల భారాన్ని తగ్గించడానికి విని యోగపడగల, ఆచరణలో అమలు జరగగల పథ కాలకోసం నిరంతరం కృషిచేస్తూ వుండాలి. అందు లోను మన మిత్రరాజ్యాలతో సన్నిహితమైన సంబం ధాలను కలిగినప్పుడు, ఇందుకు సంబంధించిన భారం కొంత మనకు తగ్గుతుంది. ఇందుకే యూరపు రక్షణ ఏర్పాట్లు అవసరంగా జరగాలి.

శాంతి సాధనకు సుస్థిరమైన పథకమనేదేదీ లేదు. దీనిలో అంతర్గతంగా అనేక శక్తులు వున్నాయి. అవన్నీ క్లిష్టమైనవే. అయినా ప్రతీదీ ప్రధానమైనదే. ఇవి పరస్పరం ఒకదానితో ఒకటి ముడిపడి వున్నవి. అమెరికనులకు సంబంధించినంత వరకు,

ఇందులో చాలా భాగం, వారి మానసికస్థితికీ, ప్రపంచంలో వారికి గల బాధ్యతలను గుర్తించు కొనడానికి, చరిత్రలో తమ స్థానాన్ని తెలుసుకొన డానికి మాత్రమే సంబంధించి వున్నది.

## 14

అమెరికనులు కొంతవరకు తమ చర్యల ద్వారాను, మరికొంతవరకు స్తబ్దత ద్వారాను, ప్రపంచం మొత్తంమీద అందరూ అపార్థం చేసుకునే అవకాశాలు కలిగించుకున్నారని గుర్తుంచుకొనడం చాలా అవసరం. ఈ అపోహాలను తొలగించడానికిగాను అమెరికనులు స్వయంగా చేయగలిగినది చాలా వుంది.

(1) ఈనాడు ప్రపంచ ప్రజల పరస్పర సంబంధాన్ని అమెరికనులు గుర్తించి, దానిపట్ల తమ అభిమతాన్ని పునరుద్ఘాటించాలి. ఈనాటి ప్రపంచంలో కలిగిన అపోహాలను తప్పించుకొనగలిగిన మార్గమేదీ లేదు. పెద్దలనుంచి పిన్నలవరకు మన సోదరులందరి భవితవ్యంతోను మన భవితవ్యం సన్నిహితంగా

ముడిపడింది. ఇది మన క్రైస్తవ మత సంస్కృతి నుంచి వచ్చిన మతబంధమైన సత్యం మాత్రమే కాదు. ఈనాటి ఆర్థిక, రాజకీయ వ్యవహారాలలో నిత్య సత్యం.

(2) అమెరికన్లు నమ్రతను, ఓర్పుని అలవరచుకోవాలి. ఇవి మనకు అపరిచితమైన లక్షణాలు కాదు. కాని సమకాలీన ప్రపంచంలో వీటి అవసరం హెచ్చుగా వుంది. మననుగురించి యితరులకు గల అపోహలను అన్నిటికంటె హెచ్చుగా యివి తొలగించగలవు. ప్రపంచ సమాజపు విముక్తి మనమీద మాత్రమేకాక, ప్రతి ఒక్కరి మీద వున్నదంటే మనం కష్టపడరాదు.

(3) మన ఆర్థిక వ్యవస్థను సుస్థిరంగా వుంచుకొని, యితర స్వతంత్ర దేశాల వ్యవస్థలలో దానిని సమన్వయం చేయాలి. అమెరికాలో ఆర్థికమాంద్యం వస్తే ప్రపంచం మొత్తం దెబ్బతిని పోగలదని మన మిత్రదేశాలు భయపడుతున్నాయి. ఇలాంటి ఆర్థిక మాంద్యం రాకుండా చూచుకొనవలసిన బాధ్యత,

సవాలుకూడా మన ప్రభుత్వం మీదను, మన వ్యాపారుల మీదను వుంది.

(4) అమెరికన్ సమాజానికి భౌతికవాదం, మిలిటరీ తత్వం పునాదిగా లేదని, మానవజీవితం, అందులో మానవుని హక్కులు ప్రాతిపదికగా వున్నాయని ప్రపంచానికి మరింత స్పష్టంగా తగు రీతిని వివరించాలి. కేపిటలిజమనేది యిక్కడనే అర్థశతాబ్దం కింద వున్నదానికి లేదా, యితర దేశాలలో వున్న దానికి, యిప్పటి కేపిటలిజానికి చాలా వ్యత్యాసం వుంది. పూర్వంకంటె హెచ్చుగా అది ఈనాడు సమన్వయ పరచబడింది.

(5) మనం ప్రతీపశక్తులకుగాని, స్థిరోభవ వాదనకుగాని కట్టుబడి వుండలేదని; మానవజాతి, అందులోను బడుగు దేశాల ప్రజలు, అట్టడుగున పడిపోయిన ప్రజలు తిరిగి క్రమక్రమంగా అభివృద్ధిచెందే ఉద్యమాన్ని మనంకూడా కోరుతున్నామని స్పష్టం చేయాలి. ఇందులో 'తిరిగి' అని ఎందుకు అంటున్నానంటే, ఈ ప్రజలలో చాలామంది మహోన్నతమైన నాగరికతను పెంచుకుని, అనుభవించి వుండడం చేత.

(6) ప్రజల అభ్యున్నతికి సాగే ఉద్యమాన్ని నిరోధించే శక్తులతో మన సంబంధాలను తెంచుకోవాలి. అభ్యున్నతి అనేది కలోనియల్ వ్యవస్థ ద్వారా వచ్చిన అన్నిరకాల క్రమశిక్షణను, క్రమ వ్యవస్థను విచ్ఛిన్నం చేసుకోనడం ద్వారా లభించదని మనకుగల గట్టి నమ్మకాన్ని సుస్పష్టం చేశారు. అలా చేయడంకంటే మధ్యే మార్గంకూడా వుంది. అనుభవంపొందిన దేశాలనుంచి నిరంతరం సహాయాన్ని, సహకారాన్ని బడుగు దేశాల ప్రజలు పొందవలసిన అవసరంవుంది.

(7) అన్నిటినిమించి, స్వాతంత్ర్య సమాజంలోను, అమెరికా సమాజంలోను, ఈ ప్రపంచంలోని ప్రతి ఒక్కరికోసం ఉద్దేశించిన ఆధ్యాత్మికమైన లక్ష్యం ఒకటి కలదనేది ఋజువు చేయడానికి జీవించాలి.

(8) చివరకు, అలాంటి సమాజంలో యునైటెడ్ స్టేట్స్ ప్రతిపత్తి, అన్నింటితో సమానమనేది మనం విశదంచేయాలి. ఇతరులనుంచి మనం యింకా నేర్చుకుంటూ వుండాలి. వారి సంస్కృతిలో, సాహిత్యంలోవున్న విలువను గుర్తించాలి. ప్రపంచంలో

విభిన్నమైన జాతులు, భావాలు, సంప్రదాయాలు, ఆశయాలు, విలువలు కలవని తెలుసుకోవాలి. వీటన్నింటి ద్వారా మరింతగా బలం సమకూరు తుంది.

ప్రపంచంపట్ల అమెరికాకు వున్న దృక్పథంలోని వాంఛనీయమైన యితర అనేకం అంశాలు కూడా సుస్పష్టం చేయదగినవే. కాని నేను పరిశీలి స్తున్న విషయం అమెరికాలో మార్పు చెందిన పారి శ్రామిక సమాజానికి సంబంధించినది కనక, మన దృష్టిని మరికొంతసేపు దానిపైనే మళ్ళించ వలసి వుంది.

పారిశ్రామిక, వాణిజ్య వర్గాల తొలి కర్తవ్యం ఉత్పత్తిని - పంపిణీని సమాజం శ్రేయస్సుకోసం, వాడకందారు, కార్మికుడూ, పెట్టుబడిదారు, మేనేజి మెంటుకోసం చక్కగా కొనసాగించడం. వ్యాపా రాన్ని జయప్రదంగా నిర్వహించడానికి సాంఘిక బాధ్యత మరొకటి లేదు.జయప్రదం అంటే, ఫ్యాక్టరీ లోని, సమాజంలోని విభిన్న వర్గాలపట్ల నిర్వహించ వలసిన విధులను నిర్వహించుకొనడమనే అర్థం.

ఆ తరువాత పారిశ్రామిక, వాణిజ్య వర్గాలు నిర్వహించవలసిన రెండవ బాధ్యత. ఆర్థిక మాంద్యం రాకుండా చేయడానికి తన పాత్రను తాను నిర్వ

హించడం. మితిమించిన భారం లేదా, మరింత హెచ్చుగా నిరుద్యోగంవల్ల అమెరికా ఆర్థిక వ్యవస్థ పతనం కావడం నియంతృత్వ వాదులకు ఘనమైన విజయం కాగలదు.

కార్మికులకు సంబంధించిన చిక్కులు ముందు ముందు తప్పనిసరిగా అనేకం వుంటాయి. కాని కార్మిక నాయకులు, పారిశ్రామిక వర్గాల నాయకులు కూడా యిందులో కొంత రాజకీయ చతురతను చూపాలి. కార్మికుల ఉత్పాదకశక్తిని పెంచగల పథకాలతో పారిశ్రామిక వర్గాలు సిద్ధంగా వుండాలి. తద్వారా కార్మికులు అధికోత్పత్తి ఫలితాలను అనుభవించడానికి అవకాశమివ్వాలి. అయితే కార్మికులు కూడా ద్రవ్యోల్బణం తమ ద్వారా మరింతగా పెరగకుండా వుండాలంటే, తమ ఉత్పాదక శక్తిని కూడా పెంచుకున్నప్పుడు పూర్తి లాభం కలుగుతుందని గుర్తించాలి.

మేనేజిమెంటులు తమకు గల సాంఘిక బాధ్యతను పూర్తిగా ఆమోదించడం వల్ల కార్మికులతో సుహృద్భావ పూర్వకమైన సంబంధాలను జయప్రదంగా నెలకొల్పుకొనవచ్చుననే నమ్మకం కలుగుతున్నది. అమెరికా పరిశ్రమలలో అనేకం ఈనాడు సామర్థ్యం లేనట్లు నిరూపించుకొనే స్థాయిలో

ఉత్పత్తిని కొనసాగిస్తున్నవి. ఈ మధ్య సంవత్సరాలలో అనేక రకాల మార్పులు ఘనంగా సంభవించినప్పటికీ, సాధ్యమైన సామర్థ్యంలో నూటికి 60_65 వంతులకు మించని సామర్థ్యంతో నిర్వహించబడుతున్న పెద్ద పరిశ్రమలు అనేకం వున్నాయి. సాంకేతికమైన మార్పులకు అవసరమైనంతగానే కార్మిక సంబంధమైన మార్పులు జరగడానికి కూడా ఈ విధంగా యిక్కడ పెక్కు అవకాశాలు వున్నాయి.

ఉత్పత్తిని సామర్థ్యంతో కొనసాగించడానికి వున్న అవకాశాలను కార్మిక సంఘాల నాయకత్వం కూడా గమనించాలి. అయితే కార్మికులకు న్యాయమైన వాటా లభిస్తున్నదనే సంతృప్తి ప్రజలకు, కార్మికులకు కలిగినప్పుడే అది అలా చేయగలదు. లాభదాయకమైన సమస్యలను గురించి చక్కగాను, నిజాయితీగాను ప్రజలు అవగాహనం చేసుకొనగల విధంగా వివరించినప్పుడే యిలాంటి సంతృప్తి తప్పక కలుగుతుంది.

సాంకేతిక రంగంలో పరిశోధనలు, కొత్త కొత్త పరిణామాలు పెక్కు విజయాలను సాధించి పెట్టిన మాట నిజమే. అణుశక్తి ద్వారా కొత్త అవకాశాలు

లభించాయి. ఉత్పత్తి, పంపిణీల ద్వారా నడవవలసిన సాంఘిక శక్తులను మరింత చక్కగా సమీక్షించవలసిన అవసరమూ హెచ్చుతుంది.

అమెరికా ఆర్థిక వ్యవస్థ ఆ రోజు కా రోజు మరింతగా సమన్విత శక్తిని సంఘటించుకొన్నప్పుడు, ప్రపంచాన్ని ఉజ్జ్వల కాంతివంతం చేస్తున్న స్వాతంత్ర్యంలో తమ భవితవ్యం, ప్రతిపత్తి అంతర్భాగ మనే సత్యాన్ని అమెరికన్ ప్రజలు గుర్తించినపుడు, రాజకీయ రంగంలో ప్రాబల్యం, రాజనీతి చతురతవంటి వాటితో నిండిన కంటక పథాన్ని విజ్ఞత, ధర్మాభిరతి, భావనా బలం ఆక్రమించుకొన్నపుడు ప్రజలు యిప్పటికే మొగ్గు చూపుతున్న మత సంబంధమైన, ఆధ్యాత్మికమైన విలువలను వారు (ప్రజలు) తమ దైనందిన జీవితంలో యింకా ఎక్కువగా ఆచరణలో పెట్టినపుడు తమ భవిష్యత్తుకు అభ్యున్నతి తథ్యమని ఘాఢంగా చెప్పుకో వచ్చు.

**Swatantrya Navodayam** *Re.* **1** -

అమెరికా కేపిటలిస్ట్ దేశమని పెద్ద ప్రతీతి. పారిశ్రామిక దేశాలలో ప్రపంచంలోని అన్ని దేశాలలోను అగ్రస్థానమ్ అమెరికాదే. ప్రజా స్వామిక దేశంగా అన్ని దేశాలలోను తమదే అగ్ర స్థానమని కూడా అమెరికా చెప్పుకొంటూ ఉంది. అట్టి దేశంలో వెనుకటి ఆర్థిక వ్యవస్థ, ఇప్పటి ఆర్థిక వ్యవస్థ ఎలా ఉన్నది. మానవులకూ, జాతు లకూ మధ్య స్వయం నిర్ణయాధికారం, పరస్పర బంధుత్వం అవసరమన్న సూత్రాలను అమెరికా ఏవిధంగా అమలు జరిపిందీ వివరించే గ్రంథ మిది.

ఉత్పత్తిని, పంపిణీని సమాజం శ్రేయస్సు కోసం ఎలా వినియోగించవలసినది, పరిశ్రమల యాజమాన్యంలో కార్మికులు పాల్గొనడంవల్ల ఎంతవరకు సమాజానికి లాభం కలిగేది కూడా ఇది విశదం చేస్తుంది.

